"ఏమిటో: ఇప్పుడు యోచిస్తే ఏమనిపిస్తుందంటే-ఆమెది గొప్ప హృదయమని. ఆమె ఆకారం కాదు, అలవాట్లు కాదు, ఆమెకి నాపైన కలిగిన గొప్పప్రేమ నన్నంత వశ్యుణ్ణి చేసుకుంది. పైగా కొద్దో గొప్పో, ఆ వయసున నన్ను ఆకర్షించగలిగిన ఆర్టిస్టు."

"మీ బావ?"

"అతని బావసంగతి చాలా స్పష్టం. అట్లాంటివాళ్ళని రోజూ చూస్తూనేవుంటాము." అన్నాడు శానిటరీ.

"పోనీ, ఆమెకి నీమీద ఎందుకా ఇష్టం అంటావు?"

"దాన్నే నేను గొప్ప హృదయమంటాను. ఈ ప్రేమనే ఐశ్వర్యవంతులకీ, రాజకుమారులకీ, లేక జానపదులకీ కర్షకులకీ అంటకడితే ఏ కథకుడో, మీకు చాలా సహజంగా అందంగా కనపడుతుంది. లేని అందాలుకూడా కల్పించుకుంటారు సులభంగా. కాని మామూలు మట్టి స్త్రీకి, నాలుగు డబ్బులకి తనని అమ్ముకునే స్త్రీలో, ఏ అవసరమూ, ఆశా లేని ప్రేమ వుందంటే నమ్మడం కష్టం. మనం జీవితసూత్రాల కింద, మన ఆధిక్యతా భావంకోసం నిజమని నమ్ముతున్న విలువలు తారుమారౌతాయి."

"మరి ఇంతకీ మనలింగరాజు కొడుకు సంగతేమంటావు?"

"ఏమంటాడు? కులటల్లోనే నిజమైన ప్రేమ వుంటుంది, అందులోంచి ముఖ్యంగా నాటకాలవాళ్ళల్లో, సినిమా స్త్రీలలో తప్పకండా ఆశీర్వదించి పెళ్ళి చెయ్యమంటాడు."

"నీ కొడుకు చేసుకుంటానన్నా అంతేనా?" అని దిక్కరించాడు తాసిల్దారుని.

"ఒప్పుకోను. ఎందుకంటే నిజమైన ప్రేమ కాపరానికి ఏం అవసరం? విద్యుల్లత పడకగదుల్ని వెలిగిస్తుందా? కిరసనాయిలు బుడ్డే కావాలి ఆ పనికి. ఒక సంగతి చాలా స్పష్టం నాకు. స్త్రీలో గొప్ప ప్రేమ కలిగినా సరే, ఎన్నడూ తనని ప్రేమించిన పురుషుడి జీవితాన్ని ఆ ప్రేమ మూలంగా నాశనం చెయ్యడానికి ఒప్పుకోదు—ఆ పురుషుడు కూడా ఆ ప్రేమే ముఖ్యమై, తక్కిన నాశనాలకి సంసిద్ధుడైతే తప్ప!"



# బోగం మేళం

పెళ్ళిభోజనంచేసి తాంబూలం వేసుకుంటున్నారు. రాత్రి తొమ్మిదిన్నర అయింది. ఈపాటికి లేచిపోవలసిందే ఎవరిళ్ళకు వాళ్లు. కాని బయట వాన కురుస్తోంది. కాదున్నవా రదృష్టవంతులు. వారుమాత్రం గొప్పగా వెళ్లిపోయినారు.

"వాన వెలిసేట్టు లేదు. ఏం చేద్దాం?"

"ఈ ముదనష్టపు బిల్లు రాకపోతే మనవాడు బోగంమేళం పెట్టేవాడే! ఏం సాంబయ్యా? హాయిగా యిప్పుడు ఆడించుకుందుము."

"తప్పకుండా. ఏమిటాబిల్లు? బోగంమేళాలు పరిపాలనకేం అడ్డమొచ్చాయ్!"

"నీతి ప్రభుత్వమోయ్!"

"మేళాలకీ, నీతికీ సంబంధం!"

"వాళ్ల అట్లా బహిరంగంగా ఆడితే చూసినవాళ్ళలో...."

"తెలివితక్కువగా మాట్లాడకు. ఇంకా బోగంవాళ్లు చీరెలు కప్పుకొని ఆడతారు. భరతనాట్యమని పేరుపెట్టి పైనో గుడ్డా, కిందోగుడ్డా కట్టుకుని పసిపిల్లలూ, ముసలమ్మలూ రంగులు పూసుకుని, సినిమాల్లోనేకాదు, గవర్నర్గముందుకూడా తైతక్కలాడితే, చాలా బావుంది. ఏం?"

"కాని, వాళ్లు వేశ్యలు కాదుగా?"

"వేశ్యలకి డబ్బు చెల్లించుకోవాలి. వాళ్ళకు అదీ అక్కర్లేదు!'

అసలు అది కాదురా. ఈ భోగంకులానికి అది అవమానమని"

"పాకీవాళ్ళని రద్దుచెయ్యరేం?"

"కౌన్సిలు మెంబర్లకి ఇబ్బందికదూ; అందుకని."

"ఇదీ ఇబ్బందే! కాని బయటికి ఆ మాట, సభలో అనే ధైర్యం పోయింది"

"ఈ బిల్లు చేసినవాళ్ళు వ్యభిచారచరిత్ర ఎవరన్నా చదివారంటావా? ఏదో కీర్తికోసం చేసిన పనులు తప్ప"

"ఇట్లాంటి బిల్లులు చాలా అపాయకరం. పాకీవాళ్ళని రద్దుచేస్తే వాళ్ళపనిని యంత్రాలన్నా చెయ్యాలి, లేకపోతే ఎవరికి వారన్నా చేసుకోవాలి. వేశ్యలపని యంత్రాలు చేయలేవు. కనక సంసారస్త్రీలే చేస్తారు ఆపని. మనుష్యులు వుత్త యంత్రాలనీ, తక్కిన శక్తులమల్లేనే మనుష్యస్వభావాన్ని కూడా అధీనంలోకి తీసుకురాగలమనే ఉద్దేశ్యం బయలుదేరిందోయ్. నాజీజం, కమ్యూనిజం సిద్ధాంత మది" అన్నాడు కాలేజీ ప్రిన్సిపాల్.

"తక్కిన దేశాల్నించన్నా పాఠాలు నేర్చుకోరు. మనం చరిత్రను బోధిస్తాం. కాని, చరిత్రనుంచి ఏమీ నేర్చుకోము"

"మనదేశప్రజలు వేరనేగా మొదటినుంచీ కాంగ్రెసువారి వాదన. మన ప్రజలకి తాగుడు లేకపోయినా ఇబ్బందిపడరు. ఏదో భోగంవాళ్ళు ఉన్నారు గనుక వాళ్ళమీద దయతలిచి ఉపయోగించుకుంటారు గాని, అసలు అటువంటి బుద్ధే లేదు భారత స్త్రీకి ఎంత స్వతంత్రం వచ్చినా సీతా దమయంతుల మూర్తుల్ని హృదయంలో ఆరాధిస్తో, పతిసేవలో నిమగ్నమై ఉంటుందనే కదా?"

"మొన్న నా క్లయింటు వెంకయ్య అంటున్నాడు— ఈ బిల్లు రావాలని. తన కులానికి తను సంస్కరణనాయకుడు కావాలనీ అతని ఆశలే. చాలాతంటాలుపడ్డాడు ఈ బిల్లుకోసం. ఇగేమిటండీ, బిల్లుపెట్టించి పెళ్ళిచేసుకోమంటే, ఈ....... లు పెళ్లి అని ఏదో చేసుకుని, సంపాదన యథాప్రకారమే సాగించారూ!"

"ఏమోగాని, పెళ్ళిళ్ళలో భోగంమేళాలు తీసెయ్యడం చాలా మంచిపని చేశారు" అన్నాడు రాజారావు.

"ఏం?"

"చాలా మనుషుల్ని పాడుచేస్తాయండి. పెళ్లి హడావిడిలో దంపతులు యెడమై వుంటారు. అదీగాక మంచి భోజనం, అత్తరూ, సంగీతం, బనారసు చీరెలూ....చాలా ఉద్రేకంగా ఉంటుంది. పైగా ఎదురుగా నడుములూ, కళ్ళూ తిప్పుతో వీళ్ళూ"

"హాలిడే స్పిరిట్ అంటావు."

"మరి యీ సంగతి యోచించు. ఈ భోగంవాళ్ళన్నా యెదురుగా లేకపోతే, పెళ్లి హడావిడిళ్లో ఎవరు ఎవరిపెళ్లాలో గుర్తులు తప్పిపోతాయి."

"అంతే కాదు. చాలా త్వరలోనే భరతనాట్యంవాళ్లని పిలిపించి నృత్యాలు చేయించుకుంటారు."

"నిజంగా జరిగిన ఓ కథ చెబుతా వినండి-వాన తగ్గలేదు ఇంకా. కాలేజీలో చదువుకుంటున్నాం. నా ప్రాణస్నేహితుడు, రూంమేట్, ప్రభాకరం పెళ్ళికి వెళ్ళాను. ఎవరి కంటావు? హైకోర్టుజడ్జీ కూతురికి. ఉద్దండుడు ఆయన. కూతురికి శరీరావసరమని గాని, లేకపోతే పెళ్ళిచెయ్యడమనే తక్కువ స్థితికి దిగడనుకో. పదివేలు కట్నం మా బీద ప్రభాకరానికి. ఒక్కతే కూతురు గనక,

ముందుముందు ఆ స్తికి హక్కుదారుడు మావాడు. కాని, మేం తర్లివెళ్ళిననాటినించీ, మమ్మల్ని యేదో ముష్టివాళ్ళమల్లే చూశాడు ఆ జడ్జి. అన్ని సౌకర్యాలూ గొప్పగా వున్నాయి. కాని ఆ వాతావరణం, "మీవంటివాళ్ళని నేను ఆదరించాల్సివొచ్చింది, నా కూతురు కారణంగా" అన్న బాధ. ఈ జమీందార్లు చూడు— మర్యాద చేస్తారు, అట్లా. మర్యాదే—మిమ్మల్ని మర్యాద చెయ్యక పోతే, మా మర్యాదకి లోపం కనక మిమ్మల్ని మర్యాద చేస్తున్నాం. అంతేగాని........ఎంత దొంగతనం అంటావు. అందరి కంటే యెక్కువ వినయం చూపుతారు. కాని ఆ వినయం వెనక చాలా గర్వం. జమీందార్లే అక్కర్లేదు, వాళ్ళదగ్గిర నాలుగేళ్ళు వున్నవాళ్ళకి కూడా వొస్తుందది. అవును. గాయకుడివి, నీ దగ్గిర కళవుందిగనక, కళను ఆదరించే ప్రభువుని నేను గనక, నిన్ను గౌరవం చేస్తున్నాను. అంతేగాని—నువ్వూ, నీ సంగీతం........" అన్నట్టు వుంటుంది. ఆ జడ్జిని చూస్తే నాకు, మేము యువక పురుగులం, అతని అల్లుడితోసహా "మీ మొహం, లక్ష జన్మ లెత్తితే మీరు జడ్జీలు కాగలరా?" అంటున్నాయి అతని కళ్ళు.

ఆ జడ్జిగారికి ఓ తమ్ముడు ఉన్నాడు. అతను రసికావతంసుడు. జడ్జీగారిని అడక్కుండానే ఓ భోగంమేళంతో సహా దిగాడు పెళ్ళికి.

ఆయన వేశ్యాప్రియురాలికి ఓ పదహారేళ్ళ కూతురు ఉంది. ఆ కూతుర్ని ప్రకటించి, పైకి తీసుకురావాలని ఆయన ప్రయత్నం. తీరా భోగంమేళం వచ్చింది గనక, ఆమెవన్నీ వీలైనంత ఉపయోగించుకున్నారు ఆ పెళ్ళిలో. ఆ అమ్మాయిపేరు రాధ. ఆ రాధవంక సరిగా చూపన్నా పడనీడు ఆ జడ్జీ తమ్ముడు. నిజంగా

చాలా అందం— అందమేకాదు, ఆమెలో ఓ గుణం ఉంది. తల్లిలోనూ వుందిలే! అదే జడ్జీగారి తమ్ముణ్ణి ఆమె గుమ్మానికి కట్టేసింది అనుకున్నాం. రాధను చూస్తే, ఆమెనించి ప్రయత్నం లేకుండానే, చూసేవాళ్ళకి ఆమెను కావిలించుకోవాలనిపిస్తుంది. కావిలించుకుంటే ఆమె ఏమీ అనదనీ, కావిలించుకోమని ఆహ్వానిస్తోందనీ, రూఢిగా తెలిసినట్టవుతుంది. చాలామంది స్త్రీలలో వుంటుంది కొద్దో, గొప్పో ఇది. ఆ ఆకర్షణ వుండడంవల్ల, ఆ స్త్రీలకి సుఖమా, కష్టమా, అంటే—ఆ సంగతి వాళ్ళ తక్కిన గుణాలమీదనో, జాతకంమీదనో ఆధారపడుతుంది. ఏమయితేనేం, రాధ సంగతే మాట్లాడడం ఆ పెళ్ళిలో అందరూ. పైగా ఆమె పాడడం, ఆడడం, జావళీలు అభినయం, ఆహ్వానం. వేళ్ళు, చేతులు, రొమ్ముంనించి కాంతులు మా మీద ప్రయోగించడం. మా కోర్కెల్ని అణుచుకోలేక చాలా బాధపడ్డాం. పైగా ఆ జడ్జీ తమ్ముడు మా బుజాలమీద కొట్టి మాతో రాధని వర్ణించడం; ఆమె ప్రతిభసంగతి గమనించామో లేదో, మా వెంటబడి అడగడం. కాని మేము ఆమెవొంకనన్నా చూడకండా ఆమెని దాచెయ్యడం.

ఆ జడ్జీతమ్ముడు రాధ అనాఘ్రాతపుష్పమనిన్నీ, అట్లానే వుంచి కళకి ఆమెని అంకితం చెయ్యబోతున్నాననీ, పెళ్ళి సభలలో ప్రకటిస్తున్నాడు. ఎవరన్నా గట్టిగా ఆ అమ్మాయి వంక చూస్తే వాళ్ళని కొట్టడానికి సిద్ధమయ్యేవాడు. బోగంవాళ్ళకంతా వేరే గదులు; మేళంలో తక్కినవాళ్లూ, ఆయనా రాధకి కాపలా. ఇది ఇట్లా వుంటూండగా, పెళ్ళి మూడోరోజు

పొద్దున్న హడావిడి. పెళ్ళికొడుకు కనపడలేదని. ఇంకొంచెంసేప టికి ఇంకోమూలనించి రాధ కనపళ్ళేదని.

అని కధ చెప్పి రాజారావు మాట్లాడకుండా సిగరెట్ముట్టించి దిండుమీద వాలాడు. నాలుగు నిమిషాలు చూసి,

"అంతేనా కధ?" అన్నారు ఒకరు.

"అంతకన్న ఏంకావాలి? బావుందా?"

"సరేలే. తరవాత?"

"తరవాత ఏముంది? ఎంత వెతికించినా కనపళ్లేదు వాళ్లు. పెళ్లికొడుకుకి ఇచ్చిన పదివేలూ, వెండిపళ్ళాలూ లేవు. జడ్జీగారి తమ్ముడు చేయించి యిచ్చిన– రాధవి మూడువేల నగలూ లేవు. నా మిత్రుడేమైనాడని నేను గొడవపడ్డా. జడ్జీ కక్కే నురుగులు చూడ్డం నాకు చాలా వోదార్పు నిచ్చింది. బలేపనిచేశాడు అనిపిం చింది. పైగా స్త్రీ విషయికంగా చూస్తే, జడ్జీగారి కూతురికన్న రాధ ఎంత గొప్ప! ఆమె మామీద వెదజల్లిన మత్తు ఆకర్షణ, ఆమె పడకగదిలో చూపిందా మా మిత్రుడంత అదృష్టవంతుడు లేడని గర్వపడాలో లేక ఇంక వాడికి ఆమె సందిట నించి విముక్తి వుంటుందా అని విచారపడాలో తెలీలేదు." అని మళ్ళీ వూరుకున్నాడు.

"తరవాత?"

"అంతే!"

"జడ్జీగారు?"

"పెళ్ళి రద్దుచేయిస్తానని, కూతురికి మళ్ళీ పెళ్ళిచేయిస్తాననీ చిందులుతొక్కాడు. నవ్వాము ఆయన మొహానే. కాశేశ్వర్రావు గారు ఇంకా జైలులోనే వున్నారు ఆనాటికి."

"పెళ్లికూతురు?"

"నామల్లేనే ఆమె ముసలిదౌతోంది. ఇప్పుడు, మిసెస్. అని ముందర వేసుకుంటుంది. కౌన్సిలు మెంబరు. మొన్న ఈ బిల్లుని చాలా ప్రోత్సాహపరిచింది."

"వాళ్ళిద్దరూ?"

కొంచెం వూరుకుని,

"చెప్పమంటారా? తరవాత పదేళ్ళకి గావును ఓవూళ్ళో కాఫీహోటలులో కనపడ్డాడు మా పెళ్ళికొడుకు. ఇద్దరం గుర్తు పట్టుకోగలిగాం. అతను ఆ వూళ్లో రాధతోనే వున్నాట్ట. కొంచెం 'సీడీ' గా అయినాడేమో ననిపించింది. కాని, ఏం చెప్పలేను. మామూలుగానే వున్నాడు. అంతే. ఘనకార్యం చేసినట్టుగాని, అంత రసికురాల్ని అనుభవించినందుకుగాని అతనిలో మార్పేమీ లేదు. దరిద్రమూ లేదు, ధనమూ లేదు. అప్పు డడిగాను—

"ఏం జరిగిందిరా? ఎందుకు వచ్చేశావు?" అన్నాను.

"ఏం లేదురా. పెళ్లికొడుకుని గనక రాధతో పరిచయం సులభమయింది. పెళ్లికొడుకు గ్లామర్ రాధ మనసులో పనిచే సిందిగావును"

"సరేలే. ఎందుకు మాయమైనావు?"

"నీ కా వీలు కలిగితే నువ్వు పారిపోయివుండవా?"

"ఏమోలే, అంతవరకూ రానివ్వనేమో"

"ఎంతవరకు?"

"అన్నిటినీ, అందరినీ వొదిలి పారిపోయేటంతవరకు"

"అంటే జీవచ్ఛవానివి గనక"

"సరేలే. ఆ అమ్మాయి ఎందుకు వచ్చిందిరా?"

"ఏమిటో! చాలాకాలమైంది. మరిచిపోయినాను. పినమామ గారిని తప్పించుకొని రాధగదిలోకి పోయి, ఆమె నాట్యాన్ని పొగుడుతున్నాను. దగ్గిరగా నుంచొని, "ఏదో అందరూ అంటారు, ఆమాట" అంది. నేను ప్రత్యేకంగా అంటున్నానని ఆమెకి చెప్పే మార్గం, నాకు అది తప్ప ఇంకోమార్గం కనపడలేదు. అంతే ననుకుంటా. ఆవిధంగా తప్ప స్త్రీమీద ఇంకోవిధంగా గౌరవం కనపర్చలేమనుకో. అది వీలుండగా, వయసులో వుండగా, తక్కిన పొగడ్తలన్నీ వుత్త సారంలేని మాటలు. ఆమె అందం చూశావుగా! తనే నన్ను రాత్రి జడ్జీగారి స్టడీగదిలో కలుసుకో మంది. అక్కడా సోఫామీద నాట్యమాడిందనుకో. ఇంక ఆమె లేకండా బతకలేనని ఆ రాత్రే సోఫామీదే తెలిసిపోయింది నాకు. తరవాత పారిపోవడమూ—? జీవితంలో ముఖ్యమైన మార్పులు జరిగే సంగతులు ఎందుకు చేశామో, ఎప్పుడూ అర్థం కాదను కుంటా"

"సరేకాని, ఇప్పుడేం చేస్తున్నావు?"

"ఏం లేదు. ఆ డబ్బుని జాగ్రత్తగా వాడ్డీకి వేశాం. బాగానే బతుకుతున్నాం."

"రాధ వుందా నీ దగ్గిర? వాళ్ళ బంధువులు గోలచెయ్య లేదా?"

"మాకు తెలిసినవాళ్ళల్లో నిన్నే మొదట చూడడం."

ఆదేదీ నాకు బావుండలేదు. మిత్రుడు సుఖంగా వున్నా డంటే సంతోషమేగాని, ఇట్లాంటి వ్యవహారాలలో, దరిద్రంలో కుమలడమో, ఇద్దరిలో ఒకరు రెండోవారిని వంచించడమో, ఏం చేశామా అని తీవ్రపశ్చాత్తాపమో— ఏదోఒకటి జరగకపోతే,

స్వకీయంగా అపరాధం జరిగినట్టుంటుంది. ఎందువల్లనో అది మనలోని ఈర్ష్యవల్లా, మన ఆలోచనల అలవాట్లవల్లా, చిన్నప్పటి బోధనలవల్లా. ఏమోమరి— హరిశ్చంద్రుడట్లా మాలకొలువులోనే వుండిపోయినట్టు నాటకం అంతమయితే భరించగలమా? రావణుడు సీతని రాణీ చేసుకుని లంకని ఏలాడంటే ఒప్పుకుంటామా? ఫిల్ములో మనిషిని చంపినవాడు సుఖంగా తప్పించుకుని ధనవంతుడైనాడంటే? ఇదీ అంతే!

నాలుగయిదురోజులు ఆ వూళ్ళోనే వున్నాను. అతను తన ఇంటికి రమ్మని పిలుస్తాడేమో ననుకున్నాను కాని పిలవలేదు. రాత్రిళ్ళు హోటల్లో పడుకుని ఆలోచించుకునేవాణ్ణి. ఆ రాధ అందాన్నంతా ఎంత గొప్పగా అనుభవించాడో ఇంకా అంత గొప్పగానూ చూసుకుంటున్నాడా అనే ప్రశ్నలు వొచ్చేవి. కాని అతన్ని ఆ మాట ఎట్లా అడగను?

మర్నాడు హోటల్లో అతన్ని కలుసుకున్నప్పుడు అతని వంక ఇంకా పరీక్షగా చూశాను. అతని వొంటిమీదా, బట్టలమీదా అశ్రద్ధ కనపడుతోంది. మరి, యే ఉద్యోగమూలేని మనిషికి అంతశ్రద్ధ యేముంటుంది? కళ్ళలోకూడా ఏ ఉత్సాహమూ, ఆశా లేవు. కాని— దిగులూ, నిరాశా కూడా లేవు; బాధా లేదు. కాని ఇతని జీవితమే మామూలుగా నడిచివుంటే ఈపాటికి జడ్జీగారి లక్షల ఆస్తి, ఆయనమూలంగా మళ్ళీ ఇతను ఈపాటికి ఓ జడ్జీ కీర్తి, పిల్లలూ, గౌరవం, కార్లు! ఆ నిమిషం వ్యామోహానికి లొంగిపోయి, కలకాలం సంపదానుభవాన్ని, మర్యాదని పోగొట్టుకొని వొంటరిబతుకు బతుకుతున్నాడు. ఈ వూళ్ళో ఏ చిన్న ఇంట్లోనో కాపరం. ఈ హోటళ్ళల్లో, ఆ గుంపులో పని లేకండా

తిరుగుతూ, బతుకుతూ. బుద్ధిలోకూడా ఏ వికాసమూ కనిపించ లేదు. పైగా లోపల చచ్చే సిగ్గుపడుతో వుంటాడు.

"ఏం చేస్తావు పొద్దస్తమానం?"

"ఏంలేదు. ఇల్లానే"

"పిల్లలా?'

"లేరు.?"

"ఏమన్నా చదువుతావా?"

"ఏం చదవను."

"న్యూస్ పేపరూ?"

"ఉహూ"

"ఎందుకు చదవవూ?"

"నాకేం సంబంధం?"

"ఏంపని చేశావోయ్! ఈపని చెయ్యకపోతే ఈపాటికి ఎక్కడ వుండేవాడివో తెలుచుకోగలవా?"

"ఊ"

"దిగులెయ్యదా?"

"అప్పుడప్పుడు."

"మరి రాధ ఏంచేస్తోవుంటుంది?"

"వంటా, పొరుగువాళ్ళా, కబుర్లూ, ముఖ్యంగా నేనూ"

"ఆమె జీవితం మాత్రం ఎంత పడిపోయిందో తెలుచు కుంటుందా? ఆమె అందంతో, నాట్యంతో ఈ పాటికి...."

"అవును"

"దిగులుపడుతుందా?"

"అప్పుడప్పుడు"

అని ఆగాడు. కాఫీ తాగుతూ ఆలోచిస్తున్నాడు. మొదటిసారి తన జీవితం సమగ్రంగా నా కళ్ళలోంచి చూసుకుంటున్నాడని పించింది. కొంచెంగా పూర్వపు పట్టుదలా, కొంచెతనం వొచ్చాయి అతని కళ్ళల్లోకి.

"ఇన్నేళ్లూ నువ్వేం చేస్తున్నావు?" అన్నాడు.

"ఏం చేస్తున్నాను? ప్లీడరీ. పన్నెండెకరాల పొలం సంపాయించాను. ఓ యిల్లు కట్టాను. నలుగురు పిల్లలు. మా వూళ్ళో కొంత పేరు. నాకేం?"

"ఏం తృప్తిగా వుందా?"

"ఏమి?"

"కొంత ఆస్తి సంపాయించి కొంతమంది పిల్లల్ని పెంచుతున్నావు? నువ్వు చేసిన మహాత్కార్యం ఏమిటి?"

"ఏం అంతకన్న మనుషులు యేం చెయ్యాలి?"

"అవును. అంతేలే. కాని—అంతకన్న ఏదో చెయ్యాలనే ప్రయత్నించాను నేను."

"ఏం చేశావు; నా అంతమాత్రం చేయ్యలేదు కద?"

"పోనీ, చెయ్యలేదనుకో. కాని నేనే మామూలుగా వుండిపోతే నేనూ నీమల్లేనే కొంత ఆస్తి సంపాయించి పిల్లల్ని పోషించే వాణ్ణి."

"కాని నీవల్ల ఎవరికి ఏం ఉపయోగం ఇప్పుడు?"

"నీవల్లా? నువ్వులేకపోతే వ్యాజ్యాలు వుండవా, ఆ ఆస్తిని అనుభవించే వాళ్లు ఉండరా? పిల్లల్ని పెట్టి జనాభాని నించే వాళ్లకి తక్కువా?"

"కాని పిల్లలూ, వాళ్ళ చదువులూ, పెళ్లిళ్లూ...."

"అవును వాళ్ళని కన్నావుగనుక ఆ బాధ్యతలు. అవేవో లోకానికి ఏదో గొప్ప ఘనమైన ఉపకారాల్లా మాట్లాడతావేం?"

ఆ సాయంత్రం అతను వెళ్ళాక ఆలోచించాను. అతని మాటలవల్ల నాకు అతనిమీద కోపం ఎక్కువైంది. ఏమిటి తను జీవితపు మామూలు బాధ్యతల్ని ఎగగొట్టడానికి అతనికేమి హక్కువుంది? ఇంక తన సంగతేనా? ఎంత స్వార్థం! అతని కళ్లు తెరవడం నా ధర్మం అనిపించింది.

మర్నాడు కాలవగట్టుకు షికారు వెళ్లాం.

"మరి నువ్వు పెళ్ళిచేసుకుని వొదిలివచ్చిన అమ్మాయి సంగతి ఏమన్నా యోచించావా?"

"ఎట్లా వుంది? ఏం చేస్తోంది?" అన్నాడు. అప్పుడు అది గాడు దూరంగా. తాను పెళ్లిచేసుకున్నానని మరిచేపోయినట్టున్నాడు.

"ఏంలేదు. తండ్రి ఆస్తినంతా ఆమెకు ఇచ్చాడు. ఏదో సంఘసేవ చేస్తో పబ్లిక్‌లైఫ్‌లో ప్రాముఖ్యత సంపాయించు కుంటోంది."

"ఇంకేం!"

"ఇంకేం? ఇంక గతిలేక ఏం చేస్తుంది మరి?"

"ఏం తక్కువయిం దంటావు? మొగవాడూ, పిల్లలేనా? డబ్బు వుందికదూ? కొంచెం సాహసిస్తే అవిమాత్రం లభించేవి కాదా?

"అందరూ నీమల్లే అనుకున్నావా?"

"కాదులే— పోనీ, హాయిగానే వుందిగా. నీకేం దిగులు?"

"ఏం దిగులేమిటి? ఆమె లోపలలోపల ఏం బాధపడు తోందో........"

"బైటబాధలు చాలవూ! బైట సుఖంగా వున్నవాళ్లు లోపల యెంత బాధపడుతున్నారో యోచించేందుకు? యీ వుత్తకబుర్లు మాట్లాడకు. పోనీ ఏ బాధలన్నా ఎవరివన్నా పోగొట్టడానికి ను వ్వెన్నడన్నా ఏం చేశావో చెప్పు. నే నన్యాయం చేశాననే కోపం వల్ల, ఆమె లోపలిబాధ లేమిటో అని దైన్యపడుతున్నావుగాని. నీ కూతురు వితంతువయితే, నీ కూతుర్ని భర్త వొదిలితే ఆమె కోసం బాధపడతావా?"

"ఆ. కాని నివారించే మార్గంలేక ఊరుకుంటాను"

"నివారించేందుకు నేను వొక్కణ్ణే కనపడ్డానన్నమాట. ఒకమార్గం తెలిసికూడా ఏం చెయ్యగలను? అనేవాళ్ళ దయలో నాకేం విశ్వాసం లేదు"

"నే ననేది. పోనీ రారాదా అని."

"ఎక్కడికి?"

"ఆమె దగ్గరికి; నీ భార్యయింటికి."

"వొచ్చి?"

"వుండూ."

"ఇప్పుడు ఆమెకి నే నెందుకు?"

"నేను మాట్లాడుతానుగా."

"కాని రాధని నేను వొదిలేసి వొస్తే దాంటో అన్యాయం నీకేం కనపడదనుకుంటాను."

ఆలోచించాను.

"పోనీ, తెచ్చుకో, ఇద్దరూ ఉండనీ"

"ఏమో! ఆమె వొప్పుకోదు. రాధా ఒప్పుకోదు."

"ఆమెతో, ఈమెతో నేను మాట్లాడతాను. అన్ని ఏర్పాట్లూ చేస్తే నీకేమన్నా అభ్యంతరమా?"

"ఇంత శ్రమ నీ కెందుకో! ఎవరిమీది దయవల్ల ఈ ఏర్పాటంతా?"

"ఒక్క టడుగుతా. నిజం చెప్పాలి" అన్నాను.

"ఊ"

"నీ జీవితం ఇప్పుడు సంతోషంగా వుందా?

"ఉన్నంత వుంది. నీకు వుందా?"

"ఊ"

"అయితే నాకూ ఉంది"

"వాదించకు. నిన్ను చూస్తే ఏదో ఓ గాడిలోపడి, ఇంతే మన బతుకు అని ఆగిపోయినవాడికిమల్లే కనపడుతున్నావు.

"నువ్వా–అంతేకాదు. మనుషు లందరూ అట్లానే కనపడ తారు."

"మాకు వీళ్లు లేక. ఓ లక్షరూపాయలుంటే, నేనే జడ్జీ నైతే, ఇంతకన్న సంతోషంగా వుంటాను, అని తెలుసు నాకు. కాని వీలుకావు అవి, అందుకని ఆగిపోయినాను. ఇంక నా పిల్లల పురోభివృద్ధిలో బతుకుతో ముందుకు చూస్తాను. నీ కలాంటివి ఏం లేవు. ఆశలేదు. ఎదగడం ఆగిపోయినావు పాపం!"

అతను నిజమే నన్నట్టు ఆలోచిస్తున్నాడు.

"పోనీ దేనికోసం నువ్వింత విప్లవం తెచ్చుకున్నావో, ఆ సంతోషమన్నా మిగిలిందా నీకు?"

అతను మాట్లాడలేదు.

"నిజం చెప్పు నాతో. దాపరిక మెందుకూ? ఆ వ్యామోహం ఎన్నాళ్లుంది?"

"నాలుగైదేళ్లు."

"ఆ నాలుగేళ్ళ తరువాత ఈ పదిహేనేళ్ళు ఏం లేదు, ఆగిపోయినావు. ఏమన్నా వివేకం వుందా నువ్వు చేసిన పనిలో? తాత్కాలిక వ్యామోహంలో జీవితాన్ని ధ్వంసం చేసుకున్నావు." అతను మెల్లి మెల్లిగా ఆగి మాట్లాడుతున్నాడు.

"ఒప్పుకోను."

"ఒప్పుకోక! వుత్త పెంకితసం. ఇంకా నిజం ఒప్పుకోడం నామోషీ నీకు!"

బాగా పెడుతున్నాను అతని మొహాన.

"నేను చెప్పేమాటలు, నీకు తెలిసినంతవరకు నీతో వాస్తవం చెబుతున్నానని నువ్వు ఒప్పుకోకపోతే, మనం మాట్లాడుకుని ప్రయోజనం లేదు. నాలుగైదేళ్ళూ నే నేమనుభవించానో నువ్వు తెలుసుకుంటే అటుతరవాత వందేళ్లు సమస్త కష్టాలూ అనుభవిస్తేనేం అనిపిస్తుంది, నీకైనా సరే."

"అయిపోయినాయి కద?"

"నా అయిదేళ్ళూ అయిపోయినాయి. ఓనాడు నీ వంద ఏళ్ళూ అయిపోతాయి. ఏమి వాస్తవమైనదీ, లోతైనదీ అనుభవించకుండానే రూపాయల్నీ, పిల్లల్నీ లెఖ్ఖచూసుకుంటో నీ ఆయువు నిండుతుంది. గొప్ప కష్టదినాలూ అయిపోతాయి. అదా? ఈనాడైనా ఆ జ్ఞాపకం చాలు నన్ను గొప్ప గర్వంతో మానవ శ్రేష్ఠుణ్ణో అనిపించేట్టు చేసేందుకు. కాని క్రమంగా కాలం మరుపుని కప్పుతుంది ఎంత గొప్ప అనుభవంమీదనైనా సరే!"

"అదేమిటో ఆ అదృష్టం నాకు కొంచెం చెబుదూ?"

"ఎట్లా చెప్పను? ఏం చెప్పను? ఎట్లా నీకు అర్థమౌతుంది? పోనీ నే నడిగే సంగతులు నిజం చెబుతావా?"

"తప్పకుండా."

"నీ భార్యకాక, వేరే స్త్రీల నెరుగుదువా?"

"ఊ"

"ఎట్లా?"

"డబ్బుతో."

"నిన్ను ప్రేమించి, తా నెరిగిన మనుషుల్లో నువ్వే కావాలని ఏరి నిన్నే ఏ స్త్రీ అయినా కోరిందా?"

"లేదు."

"నీ భార్య గాని, ఇంకో స్త్రీ గాని, నిన్ను విడువలేక, తన చేతుల్లో ఖైదుచేసుకుందా? ఒక్క నిమిషం కనుమరుగైతే నీకోసం తహతహలాడిందా? నీ కళ్ళలోకి చూస్తో, బంధువుల్ని, ఐశ్వర్యాన్ని, లోకాన్ని, తననే మరిచి తల్లిమల్లే నిన్ను రొమ్ము మీదకి తీసుకొని నవ్వి, ఓదార్చి, దిగుళ్ళని తన చూపులతో, కన్నీళ్ళతో లాలించిందా?"

"అన్నీ కవిత్వాలు"

"సరేలే. నేను చెప్పినవి ముందు చాలా అల్పమనుకో. పోనీ ఎప్పుడయినా నువ్వు ఏ సౌందర్యాన్నన్నా చూసి అది కావా అని, దానికోసం సర్వమూ త్యజించగలనని, రాత్రింబవళ్ళు ఆ కోర్కెతో వుండిపోయినావా?"

"లేదు"

"ఇంక నా మాటలు నీ కే మర్థమవుతాయి. నే నేమన్నా చెపితే! తక్కిన జీవితం పోనీ, కొత్త యవ్వనంలోనైనా, ఏ లోకంలో వున్నామో మరిచిపోయి, ఇంతకన్న స్వర్గం ఏముందని ప్రతి గంటా ప్రియురాలి నేత్రాల్లో కొత్త సూర్యోదయమయినట్టు వెలగకపోతే, ఆ జీవితానికి అర్థం ఏముంటుంది? ఎంత గొప్ప కానీ, ఎంత ఐశ్వర్యం రానీ తరవాత! కొమ్మలమీది పక్షులమల్లే అవసరంలేని పలుకులు, ఆగని నవ్వులు. ఎడతెరిపిలేని ముద్దులు. నడకలో, మాటలో, చూపులో పొంగి వచ్చే ఉత్సాహాలు— ఆ కాలం పొక్కటేకద ఈ లోకంలోకి స్వర్గాన్ని లాక్కొచ్చేది? ఒకప్పుడన్నా అనుభవాన్ని యెరగని మనిషితో నేనేం మాట్లాడను?"

ఆగాడు జ్ఞాపకం తెచ్చుకుంటో.

"ఏ మాట, మామూలు మాట, దాంటో లేని అర్థాన్ని నీ చెవులకి, పక్కనించి నీ వొంక ఒక్కచూపు. నీ నరాల్లో గొప్ప విద్యుల్లతలు. రాత్రవుతోంది; పువ్వుల్లో, నవ్వుల్లో, నక్షత్రాలలో వూగుతో, అలసి నిద్రపోతూ కూడా నీ పక్కనుండి, నీ రొమ్ము చుట్టూ చేతిని తియ్యలేని అనురాగం. తెల్లారిందంటే, తానూ నువ్వూ పసితనంలోమల్లే ప్రతి స్వల్పస్థితిలో, గాలిలో వూగే గడ్డిపరక చివరి వానబొట్టులో, సోమరిగా తేలిపోయే, తెల్లని మబ్బు మెరుగులో, తూలుతో యెగిరే శీతాకోక చిలకలో, ఇదివరకు చూడని అందాల, ఆనందాల ప్రయోజనాలు; ఓ పూలదండ, పక్కమీది ఓ దిండు, చేతిగాజుకోసం తగూలు నవ్వులు, పెనగులాడటం. రోడ్డుమీది ఓ మొహం, కుక్క కక్కుర్తి, పిచికల సంయోగం, ఈగ కాళ్ళ దులుపు,

అన్నీ నవ్వులాటలే, హాస్యాలే. నిత్యమూ శరీరాలూ, ఒకరికిం కోరు కొత్త. ఇదివరకు ఎరగని మనోభావాల కొత్త వికాసం తెలీడం, ఆశ్చర్యం, ముద్దు, ఒకబట్ట కొంచెం ఒత్తిగిలితే కొత్త డిస్కవరీలాగు యీ ప్రపంచంమీది మాయతెర ఒత్తిగిలినంత సంతోషం. చూడడం, తాకడం, సిగ్గు, బలవంతం, మొదటి రాత్రి థ్రిల్, ప్రియురాలి భుజంమీద అనుకుని చంద్రుడివంక చూస్తో, వెన్నెల ఆమె చంపమీదనించి జారి చీరె చెరగుకింద కన్పించే సగం నీడల్ని చూస్తో రాత్రి రాత్రంతా గడిపావా? ఇట్లాంటివి వున్నాయని ఒప్పుకోరు. వొప్పుకుంటే అట్లా బతక లేరు. అనుభవించినవాళ్లు ఎన్నడూ చెప్పలేరు. నేను చెప్పానా? చెపితే నమ్మరు. నువ్వు నమ్ముతున్నావా?

ఆగాడు.

"ఇప్పుడూ?" అని అడిగాను వూపిరి ఆగి.

"కాని ఎంత గొప్ప అనుభవమూ పాతబడుతుంది. మామూలౌతుంది. రాధ అందంవంటి అందంకూడా కళ్ళని కట్టె య్యడం ఆగిపోతుంది ప్రత్యేకమైన సమయాలలోతప్ప. కాని తరవాత........"

ఆగాడు.

"రెండుమూడుసార్లు రాధని వొదిలి వెళ్ళిపోయాను తెలుసా?"

"ఎందుకూ?"

"కొంతకాలానికి, గంటలు బరువుగా వేళ్లాడ్డం ప్రారంభిం చాయి. ఏ ఆసక్తీ లేకండా నిర్జీవంగా అవుతున్నా నని పించింది.

"అట్లాంటప్పుడే మొగవాడికి ఓ ఉద్యోగం వుండాలి. స్త్రీ నిలవగలదు ఆ కలల్లోనే. గడిచినవికానీ, వొస్తాయనుకునేవి కాని, వాటిల్లో. అందుకనే భరించలేక, ఆ తోచనితనం రాధ తప్పే ననుకుని, నేను వొదులుకున్నవాటి భూతాలు నన్ను తరిమి ఏడిపి స్తే, పోయినాను."

"పోయి?"

"తిరిగాను. ఉద్యోగమూ సంపాయించాను. మళ్ళీ భార్య దగ్గిరికి పోవాలని యోచించాను. రాధ జ్ఞాపకాన్ని రాత్రులు తుడిచి వెయ్యాలని. ఇతర స్త్రీలను డబ్బుతో కొనుక్కున్నాను. ఒక ప్రేమవ్యవహారాన్ని అనుభవించాను."

"మరి?"

"కాని. ఒకసారి గొప్పగా. తృప్తిగా అనుభవించిన శరీరం, మరి జ్ఞాపకమను అలవాటును, అందులో రాధవంటి స్త్రీతో, దాని తరవాత ఇంకేమీ చెయ్యలేం. ఆమె నీతో లేనిది, ఉందని గుర్తు లేంచి, ఏ ఉద్యోగమూ చెయ్యలేవు. మళ్ళీ మళ్ళీ తిరిగివొచ్చాను. రాధ కిందికి వంగి పనిచేసుకునేప్పుడు ఆమె బుజాలమీద పడే జుట్టులోంచి మెరిసే బుజాలు, రాత్రులు చీకట్లో మెరిసే ఆమె తొడలూ, అట్లాంటి అందాన్ని— అందమే కాదురా ఒక్కొక్క వొంటో ఓ మృదుత్వం, నీ రక్తాన్ని నీలోంచి, తన చేతుల్లోంచి, రొమ్ముల్లోంచి, తనలోకి లాక్కునే గొప్ప ఆకర్షణ— కవిత్వం కాదు వొంటికే తెలుస్తుంది అది. అటు తర వాత యేమీ చెయ్యలేవనుకో. శృంగారం, అట్లాంటి ఆకర్షణ అంత అపురూపం కాబట్టే ప్రపంచంలో మనుషులు యుద్ధాలు, యత్నాలు, విప్లవాలు, మంత్రిత్వాలు చెయ్యగలుగుతున్నారుగాని—

ఫాసిస్టులకీ, కమ్యూనిస్టులకీ, గాంధీగారికీ, బ్రహ్మసమాజంవారికీ- యీ దీక్షాపరులందరికీ శృంగారం యెంత నిరోధమో గమనించావా? ప్రేమ—అనే నీరసపదం వాడతారుగాని, అదేదో తల్లీ పిల్లా అట్లాంటివాటిల్లో కనపడవలసిందే! పక్కమీద కలియని ప్రేమ వృత్త నాన్‌సెన్సు. చివరకి పిల్లని కావిలించుకుని ముద్దు పెట్టుకోని తల్లిప్రేమని ఆలోచించు. ఎవరూ నేర్పకండానే పిల్ల తల్లిమెడచుట్టూ చేతులు వేస్తుంది కద!" అని ఆగాడు.

"అదంతా సరేలే. కొత్తజీవితం ప్రారంభించి చూడ కూడదూ?"

"అదేగా నేను చెప్పేదీ! ప్రయత్నించి చూశాను. తిరిగి వొచ్చాను. నాకేమనిపించిందంటే, వోసారి గొప్ప శృంగారాన్ని అనుభవించినవాడు, యావజ్జీవం దానికే అంకితమైపోతాడనే నా అనుభవం మాయం కాలేదు. నా లోపలి రక్తంలోకి, ఎముకల్లోకి ఇంకి నన్ను మార్చేసింది నాకు తెలియకుండానే. అది మామధ్య జీవితంలో మమ్మల్ని గొప్ప బంధంతో కట్టేసింది."

"నువ్వు తిరిగి వొచ్చిందాకా రాధ ఏం చేస్తోంది? ఏమీ అనలేదా?"

"అట్లాంటి సంగతి ఒక్క పతివ్రతల్లోనే వుంటుంది ఏనాడైనాసరే. ఆమెకి నేను ఆర్థికంగా మర్యాదకికూడా అవసరం లేదు. డబ్బంతా ఆమెపేర వుంచి. నా స్థితి చూసి రెండుసార్లు ఆ డబ్బు పంపించేసింది."

ఇంక మాట్లాడ్డానికి నాకేం తోచలేదు. మర్నాడు ఆవూరు వొదులుతున్నాను. వెళ్లేప్పుడుమాత్రం, ఆ రాత్రి పొగలకింది లాంతరు స్తంభందగ్గిర అతను——

"నువ్వు వెడుతున్నావు. కొన్నాళ్ళదాకా మళ్ళీ ఏం తోచదు. ఎప్పుడన్నా వొస్తోవుండు!" అన్నాడు.

"పోనీ నువ్వే వొస్తూండకూడదూ?"

"పోనిద్దూ, ఆ పాత మొహాలన్నీ....నా మాటలు నీ కేమైనా అర్ధమైనాయా?"

"ఊఁ"

"ఏం అర్ధంకాలే. పెదవులమీది చిరునవ్వు వొంపులో లక్ష వెన్నెలల మృదుతేజస్సుల్ని చూడడం చాతనై తేగాని—"

అంటో వెళ్ళిపోయినాడు.

"నేను వొచ్చేశాను" అన్నాడు రాజారావు.

చాలా నిశ్శబ్దంగా విన్నారు. ఆ మధ్యలో ఎప్పుడు ఆగిందో ఆగింది వాన.

"ఇంతకీ ఇదంతా భోగంమేళాలు పెట్టడంవల్ల సంభవించిన అనర్థమంటావా రాజారావ్?" అన్నాడు కంట్రాక్టరువీరయ్య.

"అనర్ధమో, అర్ధమో—అట్లాంటివి జరుగుతాయి మరి, వేశ్యల్ని యిళ్ళకి రానిచ్చి నాట్యమాడించుకుంటే."

అందరూ లేచారు ఇళ్ళకి పోవడానికి. ఇంతలో సూరిశాస్త్రిల్లగారు వొచ్చారు. ఆయన గొప్ప డాక్టరు. పెద్దవాడు. ఆ పెళ్ళిలోకూడా ఓ పెద్ద. ఆయన కొడుకూ డాక్టరే. సూరిశాస్త్రిల్లగారు మా హోస్టు. రామయ్యగారితో ఏదో గబగబ మాట్లాడాడు.

"క్షమించండి. ఉండండి. ఇప్పుడే ఒస్తాను" అని లోపలికి వెళ్ళాడు రామయ్యగారు సూరిశాస్త్రుల్లగారితో సహా.

ఎంతకీ ఎవరూ రారు. అతిథులకి వెళ్లాలో వుండాలో తెలీదు. కొందరు చల్లగా జారుకుంటున్నారు. లోపల కొంచెము హడావిడిగా వుంది.

"ఏదో పోయిందేమో, ఏ నగలో! అబ్బా ఈ పెళ్లిళ్లు! చూచి వొస్తాను వుండండి" అని పెళ్ళికొడుకు మేనమామ వెళ్ళాడు లోపలికి.

అయిదు నిమిషాల్లో తొరతొరగా వొచ్చాడు.

"పెళ్లికొడుకు భోజనం తరవాత లేడు. కనపళ్లేదు. సూరి శాస్త్రుల్లగారి కోడలూ లేదు. వాళ్ళ పెళ్ళి వూరేగింపుకారూ కనపడదు," అని నవ్వుతున్నాడు.



# హాం కో ముహబత్

"అట్లా అంటావు, నీమీద నాకు ప్రేమ అని తెలీదా?"
అంది సోహన్ కుమారి.

ఆమె పక్కన ఖరీదుగల మాట్రెస్‌మీద పెద్ద ఎలక్ట్రిక్ పంకాకింద పడుకుని కులాసాగా కబుర్లు చెపుతున్న చక్రధరావు వీపున తేలుకుట్టినట్టు ఒక్క అరుపు అరచి మంచంమీదనుంచి దూకి దూరంగా పడ్డాడు. ఇంకా దూరంగా పడేవాడే. ఎలక్ట్రిక్ దీపాల్లో మెరిసే రంగూన్ కలప తలుపులు పెద్ద ఇనపగడియతో లోపల బిగించి వున్నాయి. తెల్లారే లోపల వాటిని తెరవవలసిన అవసరం రాదు. ఎందుకంటే పంజాబునుంచి సోహన్ కుమారిని తన భార్య అంటో తెచ్చుకున్న భాటియా రాత్రులు ఎప్పుడూ ఇంటికి తిరిగిరాడు. వెళ్లాడంటే పదిరోజులదాకా మళ్ళీ ఇంటికి రాడు. అందుకని ఆమె కిందభాగంనించి సాయంత్రం ఎప్పుడు చీకటిపడుతుందా అని కాచుకుని కాచుకుని రోడ్డుదీపాల వెలుతురు తప్పుకుంటో పైకి వొచ్చిందంటే మళ్ళీ సూర్యుడి వెలుతురు భయపెట్టిందాకా కిందికి పోనక్కర్లేదు.

చక్రధరరావుకి పెళ్లి కాలేదు. మేడమీద బ్రహ్మచారి కాపరం. కాని అతని flat చూస్తే ఆ పెద్ద మంచం, toilet సామానులు, తువ్వాళ్ళూ, సగం బట్టలున్న స్త్రీల పటాలూ, వెండి సామానులు చూస్తే ఎవరూ అతనిది వొంటరిబతుకేమోనని సందేహించరు.

మూడేళ్ళకింద తను పెట్టుబడి పెట్టి పదివేల రూపాయలూ యుద్ధకాలంలో తన తెలివితేటలుగాని, ప్రయోజకత్వంగాని

ఏమీ లేకుండా చూస్తుండగా పదిరెట్లూ ఇరవై రెట్లూ కావడం అతను గమనించి ఆ flat లో ఆ స్ప్రింగు మాట్రెస్‌మీద చాలా స్త్రీ రూపాల్ని పడుకోపెట్టి చాలా ఎక్స్పెరిమెంట్లు చేశాడు. గడిచిన రెండు నెలలనుంచీ సోహన్ కుమారి అందంతో తన గదికి వొచ్చిన కొత్త వైభవాన్ని గమనిస్తున్నాడు. అదే మొదటిసారి ఆంధ్రేతర వనిత ఆ ఇంగ్లీషు స్ప్రింగుల వూపుని ఆనందించడం. డబ్బు నిండింతరవాత ఆగదిలోనే కాదు, చక్రధర్లో మనిషిలో ఇదివరకు కనపడని కొత్త సామర్థ్యాలూ అందాలూ కనపడుతున్నాయి, ఆ చుట్టుపక్కల వీధుల పురంధ్రీమణులకి. ఆతని ప్రయత్నమూ వుంది దాంటో. తన శరీరాన్ని తయారుచేసుకునేందుకు గంటన్నర బట్టల అలంకారం. అతను రోడ్డుమీద నడుస్తో వుంటే రూపాయి ఇచ్చి సరిదిద్దించిన కోరమీసం, ఇటూ అటూ గుండెల్లో గుచ్చుకుంటోంది. బుడ్డి ఎనిమిది రూపాయలకు కొని పూసుకున్న పారిస్ స్నో, నున్నగా రోజుకి మూడుసార్లు క్షవరం చేసుకునే చంపల్నించి పరిమళాల్నీ, తళతళల్నీ రోడ్డు దుమ్మని చీల్చుకుని సూటిగా చేరుకుంటోంది వీలైనచోటనల్లా. అతని వల్లెవాటు ఉత్తరీయం సన్నదనం, నాజూకైన జరీఅంచూ, అట్లాంటి చీరెలు అతనిదగ్గర వుండకపోవని సూచిస్తుంది. అంతేగాక అతని గది వైభవకీర్తి వ్యాపిస్తోంది. స్ఫోటకంకన్న చాలా వేగంగా. ఎవరూ ఆ గదిని చూశామని చెప్పినవారు లేరు; విన్నామనేవారే స్త్రీలు. కాని ఆ కీర్తికి పరవశులయ్యేవారు వారే. అతను వొక లెజండ్ ఐనాడు. అతను చాలా మిత్రాభిలాషి. అప్పియ్యడు గాని, మిత్రుడు అన్నవాడిమీద కులాసాగా మూడు రూపాయలు ఖర్చుచేస్తాడు వుత్తకాఫీకని. కాని సాయంత్రం

అయిందా అతని మేడమీదికి ఏమిత్రుడు రావడమూ అశక్యం. ఎందుకంటే మేడమెట్ల తలుపుకి బైటపెట్టిన ఇత్తడితాళం రోడ్డు దీపం వెలుతురులో మెరుస్తో చాలా దూరానికి కనపడుతోవుం టుంది. మేడమీద లైట్లు వెలుగుతున్నాయేం? అని ప్రశ్నిస్తే. దొంగలు రాకుండా అంటాడు చక్రధర్.

రాత్రులు దీపాలకింద అతని గది అందాన్ని చూడాలని కోరే అబలా అర్జీల్ని చాలావాటిని నిరాకరించవలసి వాస్తోంది అతను. బి. వి. నరసింహారావుగారి పాటన చక్రధర్ మిత్రుడు—కొంటె చలం పేరడీ చేసి పాడుతున్నాడు. అతని బుజాన ఉన్నది బ్లూరంగు బుష్కోటు.

* * * *

అతని మాటసుమీద ఊగినా చాలూ....అని.

చక్రధర్ అన్నివిధాలా పెళ్ళికి తగిన మనిషి. రూపం, చమత్కారం, మిత్రత్వం, ధనం, చాలా వలలు వేశారు మామలు. కాని అతని ధనాదాయానికి ప్రపోర్షన్‌గా స్త్రీ ఆదా యంకూడా పెరిగింది. పెళ్ళి చాలా అనవసరమయింది. ఎవ రన్నా పెళ్ళి లేదేమని అడిగితే, ఇది గాంధియుగ మనిన్నీ, గాంధీగారు పెళ్ళి చేసుకున్నా కామంతో-ఎవర్ని చూసినా-భార్యని చూడవద్దన్నారనీ, ఈ కాలంలో రాజ్యపద్ధతులన్నీ గాంధీ ఆశ యాలమీద నడుస్తున్నాయని తన మామలు గ్రహించాలనీ, ఓ కన్యని నామమాత్రం పెళ్ళిచేసుకుని గాంధీగారి పేర కష్టపెట్ట డం ఇష్టంలేదని చెప్పేవాడు. ఇంకా మాటాడితే గట్టిగా వాదించి ప్రస్తుత ప్రభుత్వాధికారుల్ని ఆదర్శంగా చూపాడు.

"చూశారా! గాంధీ ఆశయాల ప్రకారం, నల్లమందు మీదా, సిగరెట్లమీదా ఆంక్షలు పెట్టారు. జమీలు రద్దుచేశారు. హరిజనోద్ధరణ చేశారు. శాసనాలు చెయ్యడమేకాదు, తమ స్వంత జీవితంలో కూడా ఆ ఆజ్ఞనే పాలిస్తున్నారు. పగలు ఖద్దరు ధరిస్తున్నారు. ఎవరన్నా చూడవొస్తే వొణుకుతున్నారు. అట్లాంటి వారు వివాహ విషయంలో మాత్రం గురుద్రోహులౌతున్నారంటే నేను వొప్పుకోను. భార్యల్ని మాతృసమానులుగా చూస్తున్నారని ఘంటాపథంగా చెప్పగలను. భార్యల్నిమాత్రమే నంటారా? కావొచ్చు. అంతవరకే గాంధిగారు చెప్పింది. ఆశయాన్ని ఆ మాత్రం నిలుపుకుంటే చాలు. గాంధిగారు ఒక్క కొడుకునే వొప్పుకొన్నారా? వీళ్ళూ అంతే. ఎక్కువమంది ఎవరికన్నావుంటే ఆ పిల్లలకు ఆ కాంగ్రెసుభర్తలే బాధ్యులనడం చాలా దుర్మార్గం, వృత్తవొర్చలేని స్కాండల్. "ఏ నిషా, చివరికి బీడీనిషా కూడా సహించని ప్రభుత్వం, కామ నిషాకి లొంగిందనడం చాలా తప్పు, తమ భార్యలతో ముఖ్యం."

సోహన్ కుమారితో స్నేహమైన తరవాత కొంత ఒక పద్ధతిలోకి వొచ్చాడు చక్రధర్. ఎందుకంటే, ఆమె చాలా అందం. ఆమెమాటతీరులో కొత్తదనం, నాజూకు. ఆమెని భాటియా తన భార్య అంటున్నా, ఆమె అతని భార్య కాదని తెలుసు చక్రధర్‌కి. అందువల్ల వాళ్ళమధ్య సంబంధం ప్రేమఅని పొరపడ్డాడు ముందు ముందు. పైగా కిందభాగంలో కాపరమున్న సోహన్ మొదట్లో అతన్ని బిగ్గిరిగానే తిట్టిపోసేది తన నెత్తిమీద చాలా అక్రమాలు జరుగుతున్నాయని. ఆమె తిట్లని వినడమే గాని ఆమెని ఎప్పుడూ చూడలేదు అతను. ఆమె తిడుతోవుంటే పంజాబీభాషలో ఆమె

కంఠాన్ని ఆ ఉచ్చారణ అందాన్నీ ఒక కళనివలె అనుభవిస్తో సుంచునేవాడు. ఆమె భర్త ఊళ్ళో ఉన్నప్పుడైనా ఏ అర్ధరాత్రికో గాని రాడు. అంతవరకూ ఆమె కిటికీలో కూచుని మెట్లమీది నుంచి ఎవరు పైకి వెడుతున్నారో కనిపెడుతోనే ఉండేది. ఆవేళ వాళ్ళని ఏదో బూతుమాట అనక వొదిలేదికాదు. ఆమె కంఠ స్వరం అంత శ్రావ్యంగా లేకపోతే ఎన్నడో పెద్ద తగాదా జరిగేది, చక్రధరుకీ ఛాటియాకీ. అందం ఒక్క సారస్వతంలోనే కాదు. అంతకన్న ఎక్కువగా జీవితంలో చాల కల్మషాల్ని తుడిచేస్తుంది.

ఓరోజున చిన్నప్పటి ప్రియమిత్రుడు ప్రస్తుతం ఆంధ్రావనీంద్ర కవికుంజర సూరిపాటి కాంతారాయ భట్టాచార్యులు తటస్తించాడు అతనికి. మధ్యాహ్నం మూడింటికి నడిబజారులో వున్న చక్రధర్ కొట్టులో మోగే టెలిఫోన్ పిలుపులమధ్య బేరాల కొచ్చే వర్తకుల మాటల సందుల్లో, తన చరిత్రా కవిత్వమూ తనకి జరిగిన సన్మాన గౌరవాలూ, ప్రస్తుత స్వతంత్ర సందిగ్ధ సమయంలో దేశానికి తాను ఎంత అవసరమో ముక్కలు ముక్కలుగా వినిపిస్తున్నాడు. ఆ కవిమిత్రుణ్ణి వొదుల్చుకోవాలనే అవసరంవల్ల కొట్టుని అయిదింటికే మూసి చక్రధర్ బైలుదేరాడు. కవి వదలలేదు. కవిని కాఫీహోటలుకి తీసుకుని వెళ్ళి మూడు రూపాయలు ఖర్చుచేశాడు. భోజనంతో కవి కవితాశక్తి విజృంభించింది. కీలుగుర్రం ప్రాశస్త్యం వర్ణిస్తున్నాడు. ఆ చిత్రంలో తన వర్ణనలు కొన్ని దొంగిలించారట. వాటిని కని పెట్టి దావాచెయ్యాలన్నాడు. కనక మనం వెళ్లి చూడాలన్నాడు. ఆ సినిమా అపాయంనించి తప్పించుకోడానికి చక్రధర్ తనకి తలనొప్పిగా వుందని ఇంటికి పోయి పడుకొంటా

నన్నాడు. సరే ఇంకేం తీరికగా కవిత్వం వినిపిస్తావన్నాడు కవి. ఇంకెవరినన్నా ఐతే కసిరికొట్టి పంపేవాడే. కాని కాంతారాయుడు చక్రధర్‌కి మూడోఫారంలో జాగ్రఫీలో కాపీ ఇచ్చి డజను దెబ్బలు తిన్నాడు పుట్‌బాలులో సెన్‌టరుగా ప్రసిద్ధికెక్కి చక్రధర్‌కి ఆరాధ్యనాయకుడైనాడు. అందుకని ఏమీ చెప్పలేక తల వంచుకున్నాడు ఈనాడు.

అసలు అతని కవిత్వ ధోరణివల్ల చక్రధర్‌కి తలనొప్పి వొచ్చినమాట నిజమే. కాని అంతకన్న పెద్ద కారణం వుంది. దుర్గకి రాత్రి తొమ్మిదిన్నర వరకే విడుదల. అది దాటిందా ఆమె భర్త సినీమానించి ఇంటికి వొస్తాడు. ఆమె భర్తకి అసలు ఉద్యోగంకాక, అతను స్వయంగా ఆర్డరు వేసుకున్న ఉద్యోగంవుంది. అది సాయంత్రం ఐదింటినించి రాత్రి తొమ్మిదింటివరకు పరంజ్యోతి టాకీసులో బైట కుర్చీలో కూచుని చుట్టుపక్కల వాళ్లతో కబుర్లు చెప్పడం, జనసమర్దమైనప్పుడు టిక్కెట్లు అమ్మడం, గేటుకాయడం. ఆ వుద్యోగం తనని చెయ్యనిచ్చినందుకు సినీమా యజమాని గోవిందుకి ఆజన్మాంత కృతజ్ఞతా బద్ధుడై, పలహారాలు పంపడం, చేబదుళ్లు ఇవ్వడం మొదలైన సహాయాలతో కొంత రుణం తీర్చుకుంటూవుంటాడు. దుర్గకి ఆ గంటకే విడుదల. కాని ఇంటినిండా మనుషులు. అత్త, మరదలు, వొదినలు, చిల్లర వితంతువులు. ఆమె ఆవిడి గంటలలో తన ప్రియ బంధువుల ప్రేమను తప్పించుకుని, వూపిరి పీల్చుకోడానికి సోహన్ కుమారి ఇంటికి వొస్తోవుంటుంది. గాంధిగారి బోధనలవల్ల దుర్గ బాగా హిందీ నేర్చుకోడం వల్లనే, సోహన్ కుమారితో స్నేహం, తద్వారా చక్రధర్ గది ప్రవేశం

కలిగాయి. ఎంత పవిత్రమైన ప్రారంభాలు ఎంత అపభ్రంశపు పర్యవసానాలికి కారణాలో నీతివేత్తలు గ్రహించరు ఏనాటికీ. అందులో హిందీలో దుర్గకి అభిమాన గ్రంథం తులసీదాసు రామాయణం.

అదృష్టవంతుడైన చక్రధర్‌కి కూడా శృంగారం సులభంగా లభించదు. డబ్బు సంపాయించడానికన్న స్త్రీని సంపాయించడానికి ఎక్కువ శ్రమపడతాడు. ఆతని నడకలో మాటలో కొంచెంగా ఆడతనం వుండడంవల్ల, బాలరాజుని చూసి చొంగలు కారేజాతిస్త్రీలకి వెర్రు లెత్తించడమే గాక, ఏ ఇంటి ముసలమ్మలతోనూ పసిపిల్లలతోనూ సులభంగా పరిచయం ఏర్పడుతుంది. మాటలో చాతుర్యం, ప్రియత్వం ముఖంలో అమాయకత్వం అతనికి చాలా సహాయకారులైనాయి. దుర్గకోసం ఆ ఇంటి ముసలమ్మ లిద్దరికి దగ్గుమాత్రలు మంచివి తెచ్చిపెట్టాడు. దుర్గ మేనకోడళ్ళకి రిబ్బన్లూ సైడుక్లిప్పులూ కొనిపెట్టాడు. నవీన వాత్స్యాయన సూత్రాలలో స్త్రీ వశ్యంకోసం ముసలమ్మ ప్రసన్నత ఎక్కువ లాభసాటా, లేక పసిపిల్లల చిరునవ్వులా అనేవిషయం ఇంకా చర్చనీయంగానే వుండిపోయింది. తనకి కావలసిన స్త్రీతో రెండుమాటలు మాట్లాడాడా చక్రధర్ సులభంగా, "మా ఇంటికి రావా ఓసారి?" అంటాడు, తనకేం రావాలని గట్టిగా లేనట్టే. తక్కిన సదుపాయాలన్నీ త్వరలోనే మాట్లాడుకుంటారు. దుర్గకి సదుపాయం సోహన్ కుమారితో స్నేహం. ఆమెతో మాట్లాడుతో, ఇంటికి వెడతానని బైటికి వొచ్చి, (గోషా గనక సోహన్ బైటికి రాదు) ప్రక్కనున్న మెట్లమీదనించి మేడమీదికి వెళ్ళడం, అదే కష్టంకాదు, అపక్కగా మునిసిపల్ దీపమే లేకపోతే.

దుర్గ ఈవిధంగా పైకి వెళ్ళడం సోహన్ కుమారికి తెలిసిందని ఇంకా చక్రధర్‌కి తెలీదు. దుర్గ చెప్పలేదు. చెపితే, చిరాకుపడి తనని రావొద్దంటాడేమోనని భయం దుర్గకి. సోహన్ కుమారి పతివ్రతాగ్రహాన్ని తట్టుకోలేకుండా వుంది దుర్గ. ఆవిధమైన స్త్రీలకి వుండేట్టే సోహన్ కుమారికి నీతిపట్టు ఎక్కువ. భర్తకి బద్ధులైన స్త్రీలకన్న ప్రియులకి బద్ధులైన స్త్రీలలో పాతివ్రత్యం నిరంతరం జ్వలిస్తూవుంటుంది. ఆ గర్వం లేంది తమ జీవితపు నిరంతరావమానాన్ని భరించలేరు, కాని దుర్గ సోహన్ కుమారి సక్రమమైన పంజాబీ ఇల్లాలే అనుకుంటోంది.

సాయింత్ర మైన తరువాత తన మేడమీద పురుషుడు వుండకూడదనే నియమం భగ్న మయింది చక్రధరరావుకి. పక్కమీదనించి లేచి ఆ కవిని కిందికి గిరాటువెయ్యడం తప్ప వేరే గత్యంతరం కనపడలేదు. అది అసలే వీల్లేదు. కవి మరచి వస్తాడు కూడా. కవిని ఎంత వుడికిద్దామని వాదన పెట్టుకున్నా తొణకటంలేదు అతను. పోనీ ఏమన్నా లంచం పెడితే! కాని కవిత్వ సాధనలో ధనాన్ని బూడిదకన్న తేలికగా నెట్టేశారన్న పురాతవ సత్యం నవీనకాలంలోకూడా సజీవంగానే వుందని తెలీదు చక్రధర్‌కి. కవితాకన్యకౌగిలి వదిలింతరవాతగాని తిండికీ, డబ్బుకీ దేవులాడరు. ఏకవి కూడా తన కావ్యాన్ని వినే రసికులు దొరికితే మూడు రోజులు ఆహ్లాదంగా ఉపవాసం చేస్తాడు పాపం. ఎక్కడిది కక్కడికి ఖండిస్తున్నాడు మిత్రుణ్ణి చక్రధర్, లేచిపోతాడేమోననే ఆశతో. ఏడున్నరయిందా వొచ్చేస్తుంది దుర్గ. నల్లని పెద్దకళ్లు ఎలక్ట్రిక్ దీపాలు తొడలమీద

ప్రతిఫలించే దుర్గ. ఆ భర్తవల్ల ఇన్నేళ్ళలో ఒకసారైనా మానభంగాన్నెరగదనిపించే దుర్గ.

“ఇట తెలుగు వీరుల రక్త మేరులై పారెను,
ఇట్ట తెలుగు కవుల వెలుగు వెలిగె,
చూడరా తమ్ముడా చూరులో తల పెట్టి
తాటాకు గ్రంథముల్ దాచినారు.
తెలుగు కత్తుల వేడి తేజరిల్లెడు కాంతి,
తేనీటిపలె నీకు తెల్లమయ్యె.”

అని చదువుతున్నాడు కొంతారాయుడు.

బైట రేడియోలో

“ఎత్తరా తెలుగు జండా,
పాడరా తెలుగు గీతాల్,
కొట్టరా తెలుగు ఢంకా
మొక్కరా ఆంధ్రమాతకు
తమ్ముడా!”

అని పాడుతున్నారు.

లేని ఉగ్రం తెచ్చుకుంటో చివాలున స్ప్రింగ్ మంచం మీద ఒక్క ఎగురు ఎగిరి వూగి, “ఎవరా ఆంధ్రమాత! ఎక్కడ వుంది అది?”

అని రెండు బూతులతో ముగించి, హిరణ్యాకశిపుడిమల్లే మండిపడుతో ధిక్కరించాడు చక్రధర్.

“ఎవరేమిటి? ఎక్కడ వుంటుంది! మన కన్నతల్లి మన పుటకభూమి ...”

"నేను విల్లుపురంలో పుట్టాను."

"ఎక్కడ పుడితేనేం?"

"సరేలే, ఈ మట్టి మనిషెట్లా అవుతుంది?"

"మనిషి కాదు, దేవత."

"ఏం దేవత? ఎక్కడవుంది ఆ దేవత? కొత్తదేవతలు పుడతారా? పాకిస్తాన్‌మాత ఎక్కడ వుంది? సిగ్గులేదూ? భరత మాత, రష్యా పిత, చైనా తాత, పరిషియా భ్రాత, అమెరికా మామ, పెరూ మరదలు....ఏనాటికైనా ఏ ముందు యుగంలో నైనా నవ్వుకోరా, ఆ స్థితికి రారా, మట్టిని పట్టుకుని మాతలని గంతులేసిన కాలాన్ని చూసి. నిజంగా చెప్పు ఈ పాటలూ పద్యా లకేంగాని—ఆ మట్టి నీకు తల్లి ఆనిపించిందా?"

"ఆదేమిటి అట్లా అంటావు?"

"ఎవడో ఎప్పుడో రాళ్ళు చెక్కాడా? యుద్ధంలో చచ్చాడా? పుస్తకం రాయించాడా? ఏది మహావిషయం? తిని కూచుని అంత కన్న ఏం చేస్తారు? పొద్దు పోవొద్దూ. పైగా అవన్నీ జాబి తాలుగా పద్యాలలో పాటల్లో ఏకరుపెడతారా? లేవరా ఆంధ్రుడా! పడుకోవే ఆంధ్రీ! అనుకుంటో.

"మరి ఆంధ్రజాతి...."

"జాతి, జాతి! ఏం మనుషులైనాక ఏదో ఓ భాషవుం డదూ? ఎక్కడో ఓచోట పుట్టరూ? ఏదో ఓ తిండి తినరూ? ఏదో మాతట వీళ్ళకి స్తన్యం ఇస్తోందిట. వాళ్ళో వుయ్యాల లూపుతోందిట. ఏడుస్తుందిట, ఏమి చేమిటో పాతకాలాన్ని తలుచుకుని. వున్న మనుషులు చాలరూ ఏడవడానికి? లేని మాతల్నీ అక్కల్నీ కల్పించుకుని ఆ ఏడుపులు ఎంతమంది కవులు

కలిసి రేడియోల నిండా గ్రామఫోనులనిండా ఏడ్చేది చాలక ఇట్లా కనపడ్డ వాణ్నల్లా పట్టుకుని బాధించాలా? వున్న ఏడుపులు చాలవూ? ఏమి టా

లేవరా ఆంధ్రుడా!

ఎవరి మీదకిరా ఆ లేవడం! లేవమను, పక్కలు విరగ తంతారు. ఎవరిమీదికోయ్! అరవ్వాళ మీదికేనా? ఎందుకు? వాళ్ళు అరవం మాట్లాడతారు గనకనా? వాళ్లు నీదంతా దోచుకుం టున్నారా? అదేదో రాయరాదూ పద్యాల్లో? ఈ వీరాలాపాలు, మాతస్మృతులు ఎందుకూ?

మా ఉద్యోగాల్ చేస్తున్నారోయ్!
మా చెన్నపట్నం కొట్టేశారోయ్!
మావూళ్ళో హోటళ్లు పెట్టారోయ్
మాకో కడుపు మంటగా ఉందండోయ్.

లేవరా ఆంధ్రుడా!

తన్నరా తమిళ సోదరినీ! అని రాయి.

అసలే చస్తున్నాం, బొంబే మార్కెటు ధరలూ, అమ్మకం పన్నులూ, ఆదాయం పన్నులూ జ్ఞాపకం పెట్టుకో లేక. అవి చాలక——

ఏమిటో పల్నాడు రాళ్ళుట, ద్రాక్షారామంలో గుళ్ళుట, గోల్కొండలో గోరీలుట, హంపీలో హర్మ్యాలుట, ఎవరో రాజు లట, రెడ్లుట, కవులుట, ఈ పేర్లన్నీ మరవకండిరా అని అరు స్తాడు, వాడెవరో రేడియోలో — ఆ రేడియో ఒకటి. చాంటో ఒక్కడూ సరిగా మాట్లాడడు కదా! అన్నీ ఆడకులుకులు. దీర్ఘాలు. యాసలు. ఆ కంఠాన్ని ఎక్కడ పట్టుకుని వొస్తారో!

ఎక్కడా వినం అట్లాంటి అసహజమైన ఏడుపు దీర్ఘాల్ని. మళ్ళీ మంచి సంగీతం ఏదన్నా వినపడ్డదంటే అది అరవవాళ్ళదే. పాపం వాళ్ళు నేర్చుకుని పాడుతూ వుండకపోతే మీ త్యాగరాజు ఏం రాశాడో మీకు జ్ఞాపకం వుండేదా? వాళ్ళు బాగా పాడిపోతున్నారని వాళ్ళని సాధించి సాధించి తెలుగు పాడకుండా చేశారా? త్యాగరాజు పేరునే ఎగర కొట్టేశారు వాళ్ళ పాటల్లోంచి. బాగా కుదిరింది, పాడుతున్నారు మనవాళ్ళు. మనకో సంగీతం కూడానా? అసలు మీరు కోతలు కోసి, స్తుతులు చేసుకునే ఆంధ్ర విఖ్యాతు లందరూ పరదేశాలు పోయి గొప్పవాళ్ళయిన వాళ్ళే. అసలు సగం కర్తీరకం, మీ త్యాగరాజూ, కృష్ణదేవరాయలూ, పోతన్నా. మీ మధ్య వుంటే వాళ్ళని వెక్కిరించి, వాళ్ళల్లో ఏం లేదని చప్పరించి, తిండి పెట్టక, వాళ్ళ విశ్వాసాన్ని చెడగొట్టి, వాళ్ళ గొప్పతనాన్ని వ్యక్తం కాకముందే నాశనం చేసేవాళ్ళు కాదూ! అజంతా గుహలుట; వీళ్ళవిట! నా మాట విని ఈ పద్యాలు మాను."

కాంతారాయుడికి వొళ్లు మండిపోతోంది. కలం మాని కత్తిపడితేనేగాని తన మిత్రుడు నోరుముయ్యడనుకున్నాడు. ఏమయ్యేదో మరి. ఆ నిమషానే లైట్లు ఆరిపోయినాయి. ఆ లైట్లు ఆ నిమషాన ఆరిపోకపోతే అస లీ కధ జరిగేదే కాదు. ఆ చీకట్లోనే చక్రధర్ గదిబైట చిన్న గోల జరిగింది. రెండు స్త్రీ కంఠాలు—మధురమైన కంఠాలు తగాదాలాడుతున్నాయి.

మామూలుగా దుర్గ సోహన్‌కుమారి గదికి వొచ్చింది ఆ సాయంత్రం. ఏడింటికి వెళ్ళడానికి లేచింది. సుతలామూ మేడ మీదికి వెళ్ళడానికి వీల్లేదని సోహన్ రోషంతో పోటాడుతోంది.

దుర్గ నవ్వుతో ఆమె చేతిని వొదిలించుకుని మేడమెట్లెక్కింది. పరదావెనకనించి సోహన్ కుమారి కంఠం ఆమెని వెంబడించింది. స్త్రీ శరీరానికి గోషా కాని కంఠాలకి లేదు. ప్రాతివ్రత్యం కూడా అంతే. తన మిత్రురాలి అరుపులు విని భయపడి దుర్గ వెనక్కి తిరిగింది. ఆ సమయంలో లైట్లు పోయినాయి. ప్రపంచానికే గోషాపడ్డది. ఆ అదును చూసుకుని సోహన్ కుమారి మేడ మెట్లెక్కి దుర్గని వెనక్కి లాగుతోంది. దుర్గ వెనక్కి వొచ్చేదే! ఆ సమయంలోనే లోపల చక్రధర్

"మరి వాళ్ళకంఠాలే అట్లావుంటాయో, లేక వాటి నట్లా మార్చేస్తారో...." అంటున్నాడు చీకట్లోనే.

చప్పున లైట్లు వెలిగాయి.

ఆ నిమషంలో లైట్లు వెలక్కపోయినా ఇంకా ఒక స్త్రీ మర్మచరిత్ర ఇంకోవిధంగా నడిచివుండును. మరి స్త్రీ శీలాన్ని పరలోకంలో విలువలు కట్టేప్పుడు ఈ విషయాల్ని ఎంతవరకు గమనింపులోకి తీసుకుంటారో. ఆ లైట్లకి గాని, తన ఉపేక్షవల్ల వాటిని ఆరిపోనిచ్చి, మళ్లా తొందరగా సరి చేసిన విద్యుచ్ఛక్తి ఉద్యోగస్తుడికి ఎంత భాగం బాధ్యత పంచిపెడతారో!

లైట్లు వెలిగేప్పటికి ఆ ఇద్దరు స్త్రీలూ మెట్లమీద బట్టబైలైనారు. ఆ కంఠాల శబ్దాలకి గాపును రోడ్డుమీద కూడిన నలుగురు పథికుల దృష్టిప్రసారంలో నిలిచివున్నారు. సోహన్ కుమారి కిందికి దిగడం అసంభవమైపోయింది. దుర్గని లాక్కుని చక్రధర్ వరండా నీడలోకి పరిగెత్తింది. ఆ నిమషానే వాళ్ళకంఠాలు విని చక్రధర్ బైటికి వొచ్చి, దుర్గని చూసి వెంటనే లోపలికి లాగాడు. ఎందుకంటే అతని వరండాకింద అతని

పూర్వపు ప్రియురాలు సూరమ్మ వుంది. ఎప్పుడూ ఆమెకళ్లు అతని వరండావేపే. గదిలోకి దుర్గ ఓ పట్టాన రాలేదు. చాలా బరువుగా వొచ్చింది. ఎందుకంటే మిత్రురాళ్లు ఒకరిచేతిని ఒకరు వదలలేదు. తన గాలానికి పడ్డ చేపవెంట అతుక్కుని ఇంకో చేప వొచ్చింది వలలోకి. కొత్తస్త్రీలు అకస్మాత్తుగా తన గదిలోకి రావడం కొత్తకానివాడు గనక చాలా నిదానంగా ఆహ్లాదంగా ఆతిధ్యం సలిపాడు చక్రధర్. కాని ఆ కొత్త కవిని చూసి ఆగడం ఇష్టం లేక దుర్గ లేచింది. కవిమీద లోపల మండిపడుతున్నాడు చక్రధర్. బైటనించి

"ఎత్తవోయి నీ జయజండా"

అని వినబడుతో మరీ కోపం తెప్పిస్తోంది అతనికి. దుర్గతో వెళ్ళడానికి వీల్లేదు ఆమెనెచ్చెలికి. ఆ మెట్లు సప్త మహాసముద్రాల కన్న అగమ్యం ఆమెకి రోడ్డు సద్దుమణిగిందాకా. సూక్ష్మమైన అందాలు కనిపెట్టగల కవి బుర్రలోకి అప్పటికి ఎక్కింది తన మిత్రుణ్ణి ఇబ్బంది పెడుతున్నానని. దుర్గవెళ్ళిన రెండు నిమిషాలకి అతనూ శలవుపుచ్చుకున్నాడు.

అందాలొలికే తనవింత విజిటర్ ఎవరో తెలీదు చక్రధర్‌కి. ఎందుకు వెళ్ళకండా వుండిపోయిందో కూడా తెలీదు. వలచి తనకోసం అందవతి వచ్చిందనీ నమ్మలేదు. వాళ్ళిద్దరూ వెళ్ళగానే ఆమెతో ఏం మాట్లాడాలో కూడా తెలీదు. Shelf లో వున్న ఫదర్ పేణీ, బహదూర్‌షాల పళ్లాలు తెచ్చి ఆమె ముందు పెట్టాడు, బల్లమీద. ఆమెని కూచోమన్నాడు ఎదురు కుర్చీలో. ఆమె ఏమిటో గొణిగింది. అతనికి వినపడనూలేదు. అర్థమూ

కాలేదు. తినమని బలవంతంచేశాడు. ఆమె కదలలేదు. నేలకేసి చూస్తో నుంచుంది.

"అయితే, ఇంక నేనే కూచోపెడతాను నిన్ను."

ఆ మాటకి దూరంగా జరిగి వీపు తిప్పింది.

"పోనీ, నేనే తినిపిస్తాను"

అని పళ్ళెం తీసుకుని ఆమె వీపునించి తిరిగి ఎదురుగా వెళ్ళి, ఒక ముక్క తుంచి ఆమె పెదిమకి అందివ్వబోతూ, దానిమ్మమొగ్గవంటి లావణ్యాన్ని చూస్తూ నిలబడిపోయినాడు. ఆమె అతని వంక కోపంగా చూస్తున్న సంగతి అతను గమనించుకోలేదు. చేతిని ఆమె పెదిమల దగ్గిరిగా జరిపినప్పుడు ఆమె ఒక్క విసురు విసిరింది. ఆ ముక్క ఎగిరి, సాంబమూర్తిగారి పటానికి తగిలింది. అతను నవ్వుతో

"నువ్వు తిని తీరాలి" అని మళ్ళీ ఇంకోముక్క తెచ్చి చప్పున తెల్లని పూలదండతో అందమైన ఆమె నల్లని జుట్టు ముడికింద మెడమీద చెయ్యేసి బలవంతంగా ఆమె పెదిమల్లోకి నెట్టాడు ఆ బాదుషాని. ఆమె నోరు తెరిచింది చప్పున. అతని వేళ్లు ఆమె నోట్లోకి పోయినాయి. కసుక్కున కొరికింది, కోపంగా కసిగా. రక్తం చిమ్మే తనవేళ్ళమీది గాట్లని బాధతో చూచుకునే అతన్ని పడపడ తిట్టింది, తెలుగు గాని భాషలో. తిట్లు అనిమాత్రం తెలిసింది అతనికి.

"ఏమిటి? ఏమిటి? ఎందుకు?" అంటున్నాడు, పక్క అలమారులోవున్న అయొడిన్ పూసుకుంటూ.

తనమీద ద్వేషమా? లేక తాను అంత చనువు తీసుకుం

టున్నందుకా? ఎట్లా తెలీడం? తెలుగు రాదు ఆమెకి. ఇంకో భాష రాదు తనకి.

మరి వెళ్ళిపోదేం?

తన వేళ్ళు కొరకవలసిన పనేమొచ్చింది, తన గదిలోకి వచ్చి? తన విరోధులు చేసిన కుట్రా? తన మిత్రులు చేసిన హాస్యమా?

"ఎందుకు కొరికావు? చూడు ఎంత గాయమో!"

అని ఆమె చంపల్ని పట్టుకున్నాడు. అతన్ని ఒక్క తోపుతోసి మీద పుమ్మేసింది.

అతను లాగి ఒక చెంపకాయకొట్టాడు. ఆమె చప్పున చతికిలపడ్డది.

"పో, ఇక్కణ్ణించి పో" అన్నాడు. అంత మాత్రం హిందీ తెలుసును అతనికి.

ఆమె లేచి బైటకి వెళ్ళింది. ఆమె ఎక్కడికి వెడుతుందో కనిపెట్టాలని కండువా వేసుకుని లైట్లు ఆర్పి. స్లిప్పర్లు తొడుక్కొని బైలుదేరాడు. గది తాళం వెయ్యబోతోవుంటే ఆ వరండాలో మెట్లకేసి వొంగిచూస్తూ నుంచుంది ఆమె. "జావ్" అని పెద్ద కేకపెట్టాడు.

ఆమె చప్పున దగ్గిరికి వొచ్చి చేతులు పట్టుకుని చాలా జాలిగా భయంగా

"చల్లాన" అంది.

అరపవద్దంటోంది అనుకున్నాడు.

"అయితే లోపలికి రా" అన్నాడు. ఆమె రాలేదు. చెయ్యి పట్టుకుని ఒక్క గుంజు గుంజాడు. ఆమె రాలేదు. ఇద్దరూ

పెనుగులాడారు. ఆమెని లోపలికి ఒక్క గెంటు గెంటాడు. పక్క మేడమీది దీపం గదిలో పడుతుంది. ఆమె తలలో పూలు తెగిపోయినాయి. జుట్టు వూడింది. పమిట కిందికి వేళ్ళాడుతోంది. ఆమె జాకెటు వేసుకోలేదు. సన్నటి రవికమాత్రం వుంది. వూగే ఆమె రొమ్ము, పౌర్ణమినాడు సముద్రం పొంగి చదునై మెరిసే ఇసిక మీదికి దొర్లుతున్నట్టుగా వుంది. సున్నని, చక్కపంటి ఆమె పొట్టమీద. ఆమెని కావిలించుకున్నాడు. ఒక్కసారి అమాంతం విరుచుకునిపడ్డాడు. దుర్గని పోగొట్టుకున్న అపజయభారం అతని మనసులో విజృంభించింది. ఈ వింతస్త్రీ ముందు దుర్గ ఎందుకు? ఆమె అతనంత పొడుగూ వుంది. సన్నని పొడుగైన చేతుల్లో, గొప్ప ఆర్టిస్టుకి వుండే, కొనలు తేరిన ఆ వేళ్ళలో చాలా బలం. అతన్ని తోసేస్తూవుంటే అతనికి గెలవగలనా అనే అనుమానంకూడా కలిగింది. పెనగులాడి ఇద్దరూ ఒకేలున పడ్డారు. ఒకటే తిడుతోంది అతన్ని ఆ భాషలో, రెండు మూడు తెలుగు బూతులు కూడా కలిపి. అప్నాదేశ్ లో తెలుగుపాటలంత అందంగా వినిపించాయి అతనికి ఆ బూతులు. వాళ్లు పడ్డ చప్పుడికి కింపనున్న పంజాబీ ఇల్లాలు ఏమనుకుంటోందో, ఏం అల్లరి చేస్తుందో ననుకున్నాడు ఓ నిమిషం. వేళ్లు మళ్ళీ నెత్తురు కారి ఆమె బుగ్గలకి ఎర్రనిరంగు వేస్తున్నాయి. మళ్ళీ ఆమె ఎక్కడెక్కడ కొరుకుతుందోనని భయం. ఇద్దరికీ చమటలు పోశాయి. ఆమె అరుస్తుందేమోనని కూడా ఆలోచించాడు. ఆ ఆయాసం లోనే చిక్కిన చోటనల్లా ఆమె వొంటిని కసితో నలిపేశాడు. గతిలేక ఆమె మూటమల్లే ఐ పడుకుంది ముడుచుకుని. చంద్రలేఖఫిల్ము చూసింది గావు ననుకున్నాడు. ఫిల్ములో శశాంకుడి

సెన్సార్ల భయంగాని, చక్రధర్‌కేం? పైగా అతనికి పరిచారికలు లేరు; పోలీసు లున్నారు వూళ్లో. ఆమెని మూటగా మంచంమీదికి ఎత్తుకువెళ్ళాలని చూశాడు గాని ఆమె అతని గుండెల్లమీదతన్నిన తన్నుతో కళ్లు మైకం కమ్మాయి. అప్పటికి ఆమె వొంటిమీద ఎంతమాత్రం చీరెపీలికలు నిలిచివున్నాయో అతనికి కనపడటం లేదు. నిరాశతో వొగరుస్తూ ఎదురుగా కూచున్నాడు. అతని కోర్కె పూర్తిగా ఎగిరిపోయింది. అందుకని పనిలేని బూర్జువాల జాడ్యం రొమాన్సు అంటారు కమ్యూనిస్టులు. సమరం చాలించా దని ఆమె లేచింది. వెళ్ళడాని కని గుమ్మందాకా వెళ్ళింది.అతను కదలే వోపికలేక ఆమెవంక చూస్తున్నాడు. గుమ్మందగ్గర నుం చుని చీకట్లోనే చిరిగిపోయిన తన బట్టలవంక చూసుకుని కప్పు కోవాలని ప్రయత్నించింది. చక్రధర్ నీచుడైతే లైట్లు వేసును. అతను చూసిన దల్లా ఆమె కష్టాన్ని. ఎట్లా వెడుతుంది పాపం రోడ్డువెంట లైట్లకింద ఆవస్థతో? మెల్లిగా లేచి తన ప్రత్యేక మైన ప్రియురాళ్ళకి బహుమానాలకై దాచివుంచిన చీరెని బీరు వాలోంచి తీసి ఇచ్చి

"కట్టుకో" అన్నాడు.

అది చాలా ఖరీదుగల షిఫాన్ చీరె. యుద్ధం తరవాత ఎంత ఖరీదు పెట్టినా దొరకనిది. స్త్రీలకి సహజంగానే చీరల నాణెం తెలుసు. అందులో ఆ చీర విలువని కనిపెట్టడానికి ఏ కష్టమూ లేదు. పైగా ఆమె విలువగల చీరెల కలవాటుపడ్డ స్త్రీలాగా కనుపించింది. చిరునవ్వుతో చీరవంక చూస్తూ నుం చుంది. అతనిముందు కట్టుకోడానికి సిగ్గుపడుతుందని అతను గది ఆచివరికి వెళ్ళి కిటికీలోంచి చూస్తూ నుంచున్నాడు రోడ్డువంక.

ఆమె వెళ్ళినట్టు తనకి ఎట్లా తెలుస్తుంది? కొంచెం తలతిప్పి చూస్తూనే వున్నాడు. ఎప్పుడు వెళ్ళిందో వెళ్ళిపోయింది. పెద్ద నిట్టూర్పు విడిచాడు. మళ్ళీ తనకి ఎట్లా ఎక్కడ కనపడుతుంది? ఎక్కడ వుంటుంది? ఎవరు? అట్లానే అనిపిస్తుంది. అదృష్టం చాలా సమీపంలో వున్నపుడు కూడా తెలుసుకోలేరు. ఆమె నివాసం తన కాళ్ళకిందనేనని తెలుసుకోలేకపోయినాడు. ఆమె అందాన్ని తలుచుకుంటున్నాడు. ఆమెని మరిచిపోవడం కష్టం. మరిచి పోనంతవరకు దుర్గబోటి స్త్రీలని తెచ్చుకోడమూ కష్టమే.

అలసిపోయినాడు. ఆకలివేస్తోంది.

వెనకనుంచి అతని మెడచుట్టూ చేతులు గట్టిగా బిగించి లాగింది. చచ్చాడు. కంఠం బిగుసుకుపోతోంది. తన వీపుని ఆనుకున్న ఆమె రొమ్ము సౌఖ్యాన్ని అనుభవించనేరేదు. అంతలో వుంటుంది దేశకాల భేదం. కిర్ మని అరిచాడు. చంపేస్తుంది. తగిన శాస్తి జరిగింది. స్త్రీజాతి తనమీద కసి తీర్చుకుంటోంది. అతనిమీద ఆ రాత్రి. చక్రధర్ శృంగార చరిత్ర ఆ రాత్రితో అంతం.

చాప అనుకుని తిమింగలానికి వేశాడు గాలం. పెనగులాడుతో ఇద్దరూ వెనక్కి జరిగారు. మంచంగావుసు అద్దం తగలింది ఆమెకి. ఆగింది. నిస్సహాయుడైన చక్రధర్ మెడని వెనక్కివొంచి తన మొహాన్ని వొంచింది అతని మీదికి. ఆ మధురమైన ఆమె శ్వాస కాలధూమ విషజ్వాలమల్లే తగిలింది అతని మొహానికి. కంఠం కొరికేస్తుందా? ఏమంటారు పొద్దున్నే మనుషులు! ఆమె పెదిమలు అతని పెదిమల్ని బలువుగా కసిగా. ఆమె పళ్లు అతని పెదిమలోనించి కోసుకుని అతని పళ్ళని తగిలాయి.

నవ్వి, అతన్ని ఒక్కచూపు చూపి పక్కమీద పడేసి వెళ్లిపోయింది చప్పుడు కాకుండా. ఒక్క నిమిషం వూపిరి సద్దుకుని చూశాడు ఆమె వెనక. ఎక్కడో ఆమె ఇల్లు చూడాలి. పరుగున తలుపు దగ్గిరికి వెళ్ళి లాగాడు. బైట గొళ్ళెం.

ఆ రాత్రికి తిండిలేదు, ఆమె నిరాకరించిన పలహారాలుతప్ప. తెల్లారి దాసీది తలుపు తెరిచిందాకా ఖైదు.

మర్నాడంతా కలలో మల్లే తిరిగాడు. శుకస ప్తతిలోంచి ఓ కథానాయిక ప్రాణం పోసుకుని తనకోసం వొచ్చింది. అంతా కలా? ఇంకకీ ఆమెకి తనమీద ఇష్టమా? జాలా? వుత్త శమాషా? సాయంత్రం ఇంటికి వొస్తున్నాడు. దుర్గ ఇంక తన ఇంటి వైపు రాదు. తన భాగంకింద వున్న రాక్షసి అసలు రానీదు. వొచ్చినాఇంక దుర్గ తన కెందుకు? అనుకుంటో మెట్లెక్కుతున్నాడు. కిటికీ వెనకనించి పెద్ద నవ్వు. ఈ ఇంటావిడకి ఎట్లా తెలిసింది? ఆమె రావడం వెళ్ళడం చూసిందిగావును. దీనికి బాగా బుద్ధి చెప్పాలి, భాటియాని రానీ. మర్యాదస్తుడు. తన ఇబ్బందిని అర్ధం చేసుకుంటాడు. కాని ఆ నవ్వు ఎక్కడో విన్నాడు తాను. నిన్న రాత్రి ఆమెదా? దుర్గమల్లే ఆమా ఈ ఇంటామె స్నేహితురాలా?

స్నానంచేసి, అద్దంముందు జుట్టు దువ్వుకుంటూవుండగా వొచ్చింది ఆమె నిన్న తను ఇచ్చిన చీరెని కట్టుకుని.

మర్నాటినించి హిందీ నేర్చుకోడం ప్రారంభించాడు. మామూలు పాఠాలు కాదు. కొన్ని మాటలకీ, వాక్యాలుకీ మాత్రమే హిందీ చెప్పమంటాడు. కూచో, పడుకో, కావలించుకో, ముద్దు పెట్టుకో, చీరె చాలా అందంగా వుంది, నీ కళ్లు

నక్షత్రాల లాగు మెరుస్తున్నాయి. నీ అంత అందమైనది ప్రపంచంలో లేదు. మళ్లీ ఎప్పుడు వొస్తావు?— ఇట్లా.

రోజూ కొత్తవాక్యాలూ మాటలూ రాసుకుని వొస్తాడు. కొన్ని హిందీ వాక్యాలు తప్పుతప్పులుగా తెలుగులిపిలో రాసుకుని అర్థాలు అడుగుతాడు.

చాలారోజులనించి, మహతాబు, నౌబత్, మహబూబు, ఇట్లాంటి మాటలకి అర్థాలడుగుతున్నాడు. చెప్పిన అర్థాలు అతనికి నచ్చలేదు. చివరికి 'మొహబత్' అని భద్రంగా రాసుకొచ్చి అర్థం తెలుసుకున్నాడు. అందుకనే ఆ రాత్రి ఆమె.

"హం తుంకో మహబత్ కర్తీహుం"

అనేప్పటికి అర్థమై మంచం మీది నించి ఓ దూకు దూకాడు.

ఆమె ఆశ్చర్యపడుతోంది. ఆమె అనేక సమయాల్లో సంతోషించి అతనితో అనే వాక్యమే అదీ. దానికి అతను పరధ్యానంగా "అచ్ఛా, అచ్ఛా" అంటున్నాడు. ఆ వాక్యానికి అర్థం తెలుసుకోవాలని. కాని ఆ మాట చాలా అసందర్భమైన సమయాల్లో అనడంవల్ల ఇన్నాళ్లూ రాసుకోలేదు. తప్పుమాటలకి అర్థాలడిగి, ఆమాట

మతలబ్ - అనుకున్నప్పుడు, తనని చాలా అర్థం చేసుకుంటున్నా నంటోంది అనుకున్నాడు.

మెహతాబ్-అనుకున్నప్పుడు తాను వెన్నెలవున్లే ఉన్నానని పొగిడిందనీ,

నవ్ బత్ - అనుకున్నప్పుడు, తనకంఠం సన్నాయిమల్లే ఉంటుందంటోందనీ, మహబూబ్ - అనుకున్నప్పుడు, తనని

సినీమా డైరక్టరంత గొప్పవాణ్ణి చేస్తానంటోందనీ అనుకుని పొంగిపోయినాడు. ఇవాళ నిజం అర్ధమయ్యేప్పటికి ఒక్క దూకు దూకాడు మంచంమీదనించి, నగ్నమైన ఆమె పరిష్యం గనంనించి.

ఆ వాక్యాన్నే ఇన్నాళ్లా "అచ్ఛా అచ్ఛా" అని ఇవాళ హటాత్తుగా అట్లా దూకిపోతే ఆమెకి కోపంవొచ్చింది. తన మీద విసుకుపుట్టి తప్పించుకునే ఎత్తు అనుకుంది. కాని ఒక్క నిమషంలో అతను పెద్దగా నవ్వుతున్నాడు. ఆమె ఒయ్యారంగా పక్కమీదనించి లేచింది. ఆ స్ప్రింగు వూపు ఆమె లేచే తీరుకి మెరుగుపెట్టింది. రక్తపురంగు ఉత్తరీయాన్ని కప్పుకుని నవ్వుతో అతనిదగ్గిరికి వెళ్ళి తీసుకొచ్చి కూచో పెట్టి "ఏమిటా హాస్యం?" అని అడిగింది,

"ఏంలేదు, ఆ మొహబత్‌ని చూస్తే నాకు చాలా భయం"

"ఇన్నాళ్ళూ నామీద చాలా భయమే చూపుతున్నావుగా?"

"నీకు నామీద మొహబత్ అని తెలీదు"

"పోనీ ప్యార్"

"అదైనాను."

"మరి ఏమనుకున్నావు?"

"ఇష్టం అనుకున్నాను. ఇట్లా బావుండలా? ప్రేమప్రసక్తి ఎందుకు?"

"ఏం, ప్రేమ అంత ఘోరమా? ఐనా భేదమేముంది?"

"బోలెడు."

"ఏమిటి?

"ఏమిటంటే అదో కథ....పూర్వం"

అంతవరకు తెలుగూ హిందీ కలిపి ఎట్లాగో అర్థం చేసుకుంటో సంభాషణ సాగించారు. ఆమెకి కొంత తెలుగు వొచ్చు. ఇతని మల్లేనే ఆమెకూడా దాసీఆమెనించి తెలుగు పట్టుదలగా నేర్చుకుంటోంది,

"తక్కింది రేపు చెపుతాను" అన్నాడు ఆరాత్రికి.

తెల్లారే లేచి ఓ అరటావుమీద కథ రాశాడు. దాన్ని మధ్యాన్నం హిందీ గురువుదగ్గిరికి తీసుకువెళ్ళి హిందీలో రాయమన్నాడు.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? మన ఆంధ్రులకి మరీ సిగ్గులేదు. అన్ని హిందీ పుస్తకాలూ కథలు తెలుగులోకి తర్జుమా చేసుకుంటారు. మెచ్చుకుంటారు. కానీ ఒక్క తెలుగుకథని హిందీవాళ్ళు వాళ్ళ భాషలో ప్రచురించారా? నేను ఆంధ్రమాతకి భాషాసేవ చేసి కీర్తిని సంపాయించి పెట్టదలచుకున్నాను" అన్నాడు.

ఆ కథ——

అది నా చిన్నతనం. బీదకుటుంబం మాది. కష్టపడి కాలేజీలో చదివిస్తున్నారు మావాళ్లు. ఆమెని మొదట నాటకప్రదర్శనంలో చూశాను. చెలికత్తెలతో వొచ్చి తీవిగా కూచునివుంది. వొంటినిండా రవ్వలనగలు. ముందువరసలో వాళ్ళకి కుర్చీలు చాలకపోతే నేను అక్కడ గేటుదగ్గిరమనిషితో చెప్పి కుర్చీ తెప్పించాను. ఆ కృతజ్ఞతతో నన్ను పలకరించింది. నన్ను తన యింటికి పిలిచింది. అంత అందమైన ఐశ్వర్యవంతురాలు నన్ను రమ్మనడంతో భూమిమీద నడవడం మానేశాను. ఆమె ఆవూరి ఓ గొప్ప డాక్టరు భార్య. కాని ఆమె స్వతంత్రం ఆమెది.

నేను వెళ్ళినప్పుడు ఆమె నన్ను పక్కన కూచోపెట్టుకుని బుజం మీద చెయ్యేసి బుజ్జగించింది నా కామెమీద పెద్ద ఆరాధన కలిగించి. మా కాలేజిలో కృష్ణశాస్త్రి, చలం, నండూరి మా ప్రైవేటు గురువులు. నేను శాస్త్రిగారి గేయాలు, ఎంకిపాటల్ని, చలం కథల్ని ప్రతి శని ఆదివారాలూ ఆమెకి వినిపించాను. ఆమెమీద ప్రేమ అన్నాను. రెండేళ్ళు నవ్వుతో నన్ను దూరాన వుంచి ఆడుకుంది. బీదవాడినైన నాజేబుల్ని ఎప్పుడూ డబ్బుతో నింపి వుంచింది. చివరికి నాప్రేమని ఇంక భరించలేనని మొరపెట్టి పెట్టి, ఆమె ప్రియుణ్ణయినాను. ఆనాటినుంచి మా మధ్య ఉన్నత ప్రేమ, పవిత్రప్రేమ, దివ్య ప్రణయం, శాశ్వత ఆత్మఐక్యం అనే మాటలే ఎక్కువ. పాత గురువుల్ని చలాన్ని, ఎంకిపాటల్నీ బూతులనీ, అవినీతి అనీ ఖండించుకుని, సినిమా పాటల్ని ఆశ్రయించాము మా ప్రేమ దోహదానికి.

"ఆమబ్బు ఈమబ్బు"
"ప్రేమమయమే జగము"
"హాయిగా పాడుదునా"
"ప్రేమనగరమే, ప్రేమ సౌధమే, ప్రేమ పుష్పమే"
ప్రేమ హృదయమే ....
ప్రియా మిలనకో జానా,
తేరే నయనోనే చోరి కియా

ఇట్లాంటి పాటలు పాడుకునేవాళ్ళం. ఆమె ఎంతప్రేమ చూపినా ఇంకా చాలదనేవాణ్ణి. ఆమెకోసం పెళ్ళి మానుకున్నాను.

త్వరలో ఆమె నేను బోధించిన పాటల ప్రకారం నన్ను ప్రేమించసాగింది. మాసంబంధం సంగతి అందరికీ తెలుసు.

ఆ పాటలు పాడుతో నన్ను వెంబడించింది. నన్ను ఇంటి నించి కదలనీదు. స్నేహితులు వొస్తే వాళ్ళతో మాట్లాడనీదు ఆట్టేసేపు. వాళ్ళతో బైటికి పోనీదు. రేడియో వింటున్నా, పేపరు చదువుకుంటున్నా రేడియో మూసేస్తుంది, పేపరు లాగేస్తుంది. తనవంకనే చూడమంటుంది. తనలోనే బతకమంటుంది. ఆ భర్తన్నా నాకు అడ్డపడి రక్షిస్తాడేమో ననుకుంటే ఆమె ఆటలకి ఆమెని వొదిలి చాలా ఏళ్ళయిందిట ఆయన. నేనేం మాట్లాడినా ప్రేమసంగతి ఎత్తుతుంది. నన్ను ఒక్కక్షణం వొదలలేనంటుంది. రాత్రులు సరేసరి; నన్ను డాబామీద, తోటలోనూ తనతో తిప్పుకుని,

"తీయని వెన్నెలరేయి
ఎడబాయని చిన్నెలహాయి"

అని పాడుతో గంతు లేస్తుంది. నే నెక్కడన్నా చూస్తూవుంటే,

"తుమ్మెదా ఒకసారి మోమెత్తి చూడమని" అని పాట సాగింది.

పోనీ బాగానన్నా పాడుతుందా అంటే ఆమె కంఠం ఎత్తితే పిచికలూ, కప్పలూ ఏడుపు మొదలుపెట్టినట్టుగా వుంటుంది.

అర్ధరాత్రి నిద్రపోతోవుండగా మధ్యలో "కాదుసుమా కల కాదుసుమా" అని పాడుతోవుంటుంది.

"జబుసే చలేగయేహైఁ వో
జిందగీ జిందగీ నహీఁ" అంటుంది.

రాత్రులు ఆమె చేతులమధ్యనించి ఒత్తిగిలడానికి కూడా వీల్లేదు. అట్లా అయింది నా బతుకు. సినీమాకి వెడితే ఆమె నా ప్రక్కనే కూచుని, ఫిల్ముని నన్ను చూడనీక నన్ను తనకేసి

చూడమంటుంది. ఆ కథానాయికితో కలిసి పాటలు పాడుతుంది సన్నగా నా చెవులో. 'వాళ్ళకి ప్రేమ అంటే తెలీదు; నేనే ఐతేనా....' అంటుంది. ఇంటికివొచ్చాక రాత్రంతా నేనూఆమా, ఆ పాటలపుస్తకం చూస్తో ఆ డ్యూయెట్లన్నీ పాడాలి. ఆ ప్రేమ ఘట్టాలన్నీ నటించాలి. తెరమీద కనపరచని విషయాలు భావించుకుని వాటినీ అనుసరించాలి.

గతిలేక పారిపోయినాను; కాని ఏంలాభం? ఆమెమిత్రులు, ఆమెసంసారం పీల్చి బతుకుతున్న కుటుంబాలవాళ్లు నావెంబడిపడి, "నువ్వు వొదిలివొచ్చినప్పటినించి ఆమెకి నిద్రాహారాలులేవు; కృశించిపోతోంది. నమ్మించి, ప్రేమించి ప్రమాణాలు చేసి ఇట్లా రావడం న్యాయమేనా?" అని నన్ను నిందించి లాక్కుపోయి నారు. ఆమెనించి ఉత్తరాలు విరహగీతాలతో. ఆమెకి అకస్మాత్తుగా కవనంకూడా రావడం ప్రారంభించిది. అంతే. ఇక నిలవ లేక పెషావర్ పోయినాను ఒక్క ప్రియ మిత్రుడితో చెప్పి. ఆ వేళకి తిరిగి వొచ్చాను, ఆమె చచ్చిపోయిందని తెలిసింతర వాత. ఆమె విల్లులో పదెకరాల పొలమూ, ఇరవై వేల రూపాయలు రొఖ్ఖమూ రాసింది నాకు. దాంతోనే ఈ వ్యాపారం ప్రారంభించి బాగుపడ్డాను. కాని అనాటినించి ఈనాటివరకు ఎవరన్నా ప్రేమఅనేమాట ఎత్తితే పారిపోతాను. స్త్రీ పురుష సంబంధం ఎటువంటిదన్నా కానీ, దాంటో ప్రేమప్రసక్తి వొచ్చిందా నేను ఏ మాత్రం సహించలేను."

అ యి పో యిం ది.

